Reg No M 757.

శ్రీ

# అభినవ సరస్వతి.

యనునొక మాసపత్రిక.

అష్టావధాని, జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ
ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాఁడుతాలూకా, జానపాడు.

సంపు 3.] 1911సం॥ సెప్టెంబరు,అక్టోబరు.[ సంచిక 9-10

## విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు.

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25-0-0 | —సహాయులకు | రు 5-0-0 |
| పోషకులకు | రు 10-C-0 | —చందాదారులకు | రు 2-0-0 |

భారతీవిలాస ముద్రాక్షరశాల, నర్సారావుపేట.

Printed at the Bharathi Vilasa Press,
Narasarowpet And published at Janapadu,
by the Editor Astavadhani
Janapati Pattabhirama Sastry.
1911

ఈసంవత్సరము చందాయిచ్చిన—

## సహాయులు.

1 సూరిదేవర సుబ్బానాయుడుగారు, తుమ్మపూడి.
2 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.
3 పిరాట్ల సీతాకాంతంగారు, చింతపల్లి.
4 పిరాట్ల సత్యనారాయణగారు, చింతపల్లి.
5 కొప్పరాజుగురుచంద్రశేఖరరావుగారు, ఫారెస్టుగార్డు, మేళ్ళవాగు.
6 రామసింగుగారు, నెల్లుట్ల.
7 ఏలేశ్వరం వెంకటసుబ్బారావుగారు, వకీలు, సిద్దిపేట.
8 కంచర్లలక్ష్మయ్యగారు, ఫారెస్టుగార్డు పాపయ్యపాలెం.
9 వెలుగూరి పిచ్చయ్యగారు, పెదకొదమగుండ్ల.
10 గోరంట్ల పున్నయ్యగారు, పుప్పలపాడు
11 పుప్పలపాటి వెంకటసుబ్బయ్యగారు, కరణం పుప్పలపాడు.
12 కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట.
13 సైదుఖాసింసాహెబుగారు, ఫారెస్టుగార్డు, చింతపల్లి.
14 రాజశేఖరుని లక్ష్మీనారాయణగారు, కరణం, చిట్యాల.
15 ముప్పాళ్ల వైశ్యులు ముప్పాళ్ళ.

ఇవ్వవలసినవారు—

16 ఘుడియారం వెంకటశివశాస్త్రిగారు, సంగంజాగర్లమూడి.
17 బూదరాజు వెంకటసుబ్బయ్యగారు, కరణం, స్వర్ణ.
18 తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.
19 కలవలపల్లిరంగయ్యశాస్త్రిగారు,భాస్కరాచార్యులు, యేలూరు
20 మంచిళ్ళ నారాయణరావుగారు, కంభంపాడు.
21 మెదకు శేషారావుదేశముఖుగారు, నల్లబల్లి.
22 చింతలచెర్వు గోవిందరెడ్డిగారు,గ్రామమునసబ్ చంద్రాజుపాలెం

శ్రీమత్

# అభినవ సరస్వతి.

ఇది మాసమున కొకతూరి ప్రచురింపఁబడును.

సంపు 3. } విరోధికృ॥ భాద్రపదాశ్వయుజములు. { సంచిక 9.

## గుంటూరు సమాచారము.

గుంటూరులోఁ గొందఱుపెద్దమనుష్యులు (శ్రీ) తిరుపతివేంకటేశ్వరుల నాహ్వానముచేసిరనియు అగష్టు 19-20 తేదీలలో సంపూర్ణశతావధానము జరుగఁగలదనియు నాకొక స్నేహితుఁడు విలిఖించె-అందుపై 19వ తేదీకే పోవ్వనట్టివారి ప్రస్థి లేక 20వ తేదీ గుంటూరుప్రవేశించి శ్రీవత్సానందాద్యనేక గ్రంథపఠనముచే వారి విద్వత్కవిత్వాతిశయ మెఱింగియున్నవాఁడఁగాన నట్టిమహానుభావులదర్శన మెప్పుడు చేయుదునాయను తత్తఱపాటుతో వారిఁబసకుఁజేగురికి నాయింటిముందట బైసికిలును గుఱ్ఱపుబండ్లను మూఁగియుండి యంతఃప్రవిష్టుఁడనగుటకే యతిప్రయాసపడవలసివచ్చి యెట్టకేలకుఁ బ్రవేశించియుఁ గొంతకాల మీవలనే పడియుంటిని-అందుకుఁగారణము వారిదర్శనమునకువచ్చిన మహాజనులసందష్టమే-అయ్యెడఁ గొప్పరపు వెంకటసుబ్బరాయశర్మగారును మఱికొందఱు పెద్దమనుష్యలును విచ్చేసి వారితోసంభాషించుచుండిరి. ఈసుబ్బరాయశర్మగారును నాంధ్రకవిత్వ మత్యాశుధారగాఁ జెప్పఁజూచుదమ్మునచ్చినవారు దమనిఁడిగౌరవముచే నొసంగిన కనకఘంటాదిబిరుదములం దాల్చి క్రాలుచున్నవారు-ఇట్టిపీరు పైవారితో సుహృత్సల్లాపములు సలిపి యే

సుతుఁడ నించుక యవకాశము చేసికొని తత్కవీశ్వరుల పదపద్యములకుఁ బ్రణవిల్లి వారిశిష్యవాత్సల్యమునకుఁ బాత్రుఁడనై కొంతతృప్తిజెంది నాఁటిసభకు వారితోఁ జనియేగి తత్పదపద్యములకడనే కూర్చుండి యుండఁ శ్రీ కాశీకృష్ణాచార్యులవారి యాజమాన్యముతో నవధాన మారంభింపఁ దొలుతటిదినము శతావధానమే ప్రారంభించి యేయు ద్దేశముతోనో కొందఱిచే 40 మందికే చాలునని యెత్తిపలుకఁబడిన మీఁదఁ గొంతకే ముగింపనెంచి చెప్పఁదున్నవానిలోని యవశిష్టాంశ మును ముగించసాఁగిరి-పూర్వదినము 40 మందికన్న పేరేకాని యవ ధానమధ్యమున నితరప్రసక్తియుండుటఁ- కొన్ని సమస్యలుపూరించుటయు యు స్వప్రణీతములగు నానారాజ సందర్శనములలోని యాయాభా గముల సభికులయుత్సాహము చదువుటయు లోనుగాఁగల యిత రాంశములతో శతావధానమునకన్న నినుమిక్కిలిశ్రేష్ఠమే కవులకుఁ గ లిగించిరఁట- వెంకటశాస్త్రిగారు వ్యగ్రగాత్రులై యుండి 10 నిమిషము లైనను నిలువఁబడుటకుఁ శక్తిలో లేకుండుటచే నవధానభారము జాల వఱకుఁ దిరుపతిశాస్త్రిలవారికే నవలి యితరప్రకరణములచే సభికుల కుఁ దృప్తిగావించుచుండిరి-అవధానమునయత్కించితొకరికొకరు సంప్రతించుకొనుట యెప్పుడు నుండినసంగతియే-అంతమాత్రమున నసహాయులై యవధానముఁ జేయలేరనుటకుఁ బ్రత్యేకించి చేసిన నూ జవీటిశతావధానమునున్నగు నవి సాధించును- ఇట్టియవధానమునఁ బ్రథమదినము కొప్పరపుసుబ్బరాయకవిగారును వచ్చి ప్రేక్షకులతోపా టుకూర్చుండి వెళ్ళిపోయిరఁట-మఱుదినముసభయందగ్రాసనాధిపతి యును నవధానిద్వితయమును మున్న తాసనంబు లలంకరించుచుండఁ గొప్పరపుసుకవిగారినిఁగూడ వారితోసమానముగఁ గూర్చుండఁబెట్ట వలెనని కొందఱభిప్రాయపడిరి-వారికిఁగిసమయముకాదనియు నట్లు

చూచినఁ బ్రకృత మీసభ నున్నతాసనోచితు లెంపఱో యున్నార
నియుఁ గొంత తెంపు కియ్యకొనరైరి-ఇందుమూలముగ సభలోఁ
గొంతకల్లోలముసిద్ధమై సభాధ్యక్షునాజ్ఞానుసారమువర్తించుట యు
క్తమని కొందఱభిప్రాయపడుటయు సభాధిపతి లేచి యెవరివిద్యాస
భలో వారిగౌరవమాత్రమే యుక్తమనితీర్మానించెను-వారి యాజ్ఞ
కుఁ జాలోనుగాక కుర్చీవేయునాలోచనమే కొందఱు చేయుచుండుటయు
నప్పుడు వెంకటశాస్త్రిలుగారు లేచి యెవరిపెండ్లిలో వారిచేపల్లకీలోఁ గూ
ర్చుండఁబెట్టుదురు కాని తదధికులున్నను నన్నులఁ గూర్చుండఁబెట్టరని
యు మరలఁ గొప్పరపు వారికవిత్వసభయే జరుగునంతకుఁ కుర్చీ లేక
యేమేముకూర్చుందుమనియుఁ గొన్నియుక్తులతోఁ జట్టచివరకుఁ ద
మసరసఁ గూర్చుండ ననర్హులన్నట్లు చెప్పిరి-నిజముగాఁ గూర్చుండననర్హు
లైనను నిండుసభలో నవమానకరముగ నట్లుత్తరపడియునవలసినది కా
దని కొందఱియభిప్రాయముకాని వారదిసమర్థించుకొనఁగలిగిరే
మేమిట్లుంటిమని ఘంటాపదముగాఁ జెప్పుచున్నవారు. అట్లుపైఁ గొ
ప్పరపుఁగవిగారును దదభిమానులును సభనుండి వెడలిపోయి యారా
త్రియది మొఘల్తుకంపెనీహాలులో నాటకసంఘమువారు వారురచిం
చిన పాండవవిజయముం బ్రదర్శించి వారికిమోదముఁగూర్చునెడ
నొకయుత్తరముం బంపిరి. ఆయుత్తరప్రత్యుత్తరములును శతావధా
నమును సీపత్రిక 8-9 సంచికలుచూచిన విశదమగును. ఇట్లువార
ము దినములపర్యంతముత్తరప్రత్యుత్తరములునడచినను బర్యవసానము
తేలినది కాదు. కొప్పరపుసుబ్బరాయకవిని నేను మొదటినుండి యె
ఱుఁగుదును. ఈయనకుఁ గవితాధార 10-12 వత్సరములవయస్సున
నే యారంభమై క్రమముగా నదియే యత్యాశుగామియై పండితపా
మరుల నానందింపఁజేయజాలెను. అంతయత్యాశుధారలోఁ గొన్ని

యతిభ్రంశాదిదోషములుండినను మొత్తమున నాశుధారాకవిత్వ
ములో నీప్రాంతములం దిక్కవికి సమానులు లేరని యే నాయాశయ
ము కాని సంస్కృతసాహితిగల్గియు శాస్త్రజ్ఞానమంతగా లేమిని శాస్త్రి
కులగు విద్వత్కవులకు విద్వత్కవులే భయముం జెందనలసియుండఁ
దిరుపతి వెంకటకవులపై కీర్తి సుగుణమాటలతోఁ నాలుద్రవ్వట
మాత్రము యుక్తమని యనిపించదు. కవివచ్చినపుడు మీాసములు
గొఱిగించెదమని వ్రాయనలసినదే కాని వారుచేసెడిపరీక్ష కాగి
జయింపవలసికూడ నుండునేమో యోజించుకొనవలెను. కవిత్వ
ము సభికులు కోరినప్రకారము చెప్పి మీాసములు తిరుపతి వెంకటేశు
లవితీయించుట పందెకాని లక్షణముకాదనితోఁచెడిని. వారిమీాస
ములువీరో వీరిమీాసములువారో పరస్పరము పూర్వపక్షములు సమర్థిం
చుకొని కవిత్వము చెప్పినప్పుడు గొఱిగించవలెననియు లేదా గొఱిగిం
చుకొనవలెననియుఁ గొండెలిందురు. వారిశతావధానమున నూ
ఱువర్ణనలు మేమిత్తుమనియు మాశతావధానమున నూఱువర్ణనలువారి
వ్వవచ్చుననియు సభికులకుభయులజయాపజయములు నిర్దేశించుట
కే యధికారమనియుఁ సత్సభికు లుభయులు నిచ్చిన నాడుగా నుండవలె
ననియు మేము వ్రాసినయుత్తరములకు సరియగు ప్రత్యుత్తరమీయక
యే యేవియో యుక్తులతో నావలఁబడఁజూచిరనియుఁ జిన్నతనము చే
తను గురుశుశ్రూష లేని హేతువుచేతను నిట్లు వ్రాసిరే కాని కొప్పరపు
వారి కేవిధమయిన సామర్థ్యమును లేదనుకొనుటకుఁ బండితసమ్మత
ములైనకట్టుబాట్లనొప్పికొనకుండుటయే తెల్పుచున్నదనియు మరల నొ
కసభఁగూర్చి తిరుపతిశాస్త్రిగా రందీవిషయమంతయు నుపన్యసించి
నేనుగాకినాడకు వెళ్లుచున్నాననియు బైనిబంధనలకులోనై యెప్పుడు
రమ్మనిన నప్పుడే సభకు వత్తుననియుఁ జెప్పి వెళ్ళిపోయిరి.

వారియుపన్యాసప్రకారము కొప్పరపువారికిఁ బద్యములతో జవాబు వ్రాయకుండుటచేత వీరిని లేశమును వారులక్షింపకుండుట సూచించుచున్నది. శ్రీతిరుపతి వెంకటకవులశతావధానసభయై కలహాబీజమేర్పడినది 20—8—11 వ తేది యాదివారము-సభకాకున్నను కొప్పరపువారు పైవారినిజయించుటకు నేర్పఱచుకొన్నది తరువాతి యాదివారము—ఆపై యాదివారముకూడ నేదియోసభజరుగునని కొప్పరపువారిపక్షమున నొకకింవదంతికలిగినది కాని నోటీసులుపరిచరింపరైరి-అనాహూతులైనను దత్సభకుఁబోయి సోదరకవులఁ బరీక్షింపవలెనని యుత్కల్లోలములువిని దిక్కు-దిక్కు-లనుండివచ్చిన తిరుపతివెంకటకవులశిష్యులేమి తదభిమానులేమియోచింపసాగిరి అంతనేమో యాసభజరుగదాయె-కాని వెంకటశాస్త్రిగారు క్షమాపణగోరినందున మానుకొంటిమని కొన్నిగాలివార్తలుమాత్రము వేయసాగిరి—ఎవరెంత తంటాలుపడినను సభమాత్రముజరుగదు వారువీరినడుగుటవీరువారినడుగుటయనినతోడ నేనాడివెనుకకులాగుచున్నది. మధ్య నేవిధమైనపరీక్ష లేక చెప్పుకొనిపోనిచ్చునపుడుకొప్పరపుఁగవుల నాంధ్రమందాశుకవితా చక్రవర్తులని చెప్పుట కెంతమాత్రమును సంశయముండదు కాని నేత్రావధానమందుఁ దప్ప యష్టావధాన శతావధానములయందేకాక వీరియాంధ్రభాషాశుకవిత్వమందుఁగూడఁగొప్పరపువారు తిరుపతివెంకటేశ్వరులనతిశయింపఁజాలరని ముమ్మాటికిఁజెప్పఁగలవాఁడను-ఇదినాయొక్కని యాశయమేకాక నేనెఱిఁగినవారిలో 100-కి 90 మందిదికూడ; ఇట్టిస్థితిలో గుంటూరుశతావధానమున ధారణసరిగాఁ జేయలేకపోయిరనియు నొకరికొకరు సంప్రదించుకొనిరనియు నెవ్వరో కొన్నియసందర్భములతోఁ బండితకవివరులెవరును లేనికాలమున వీరుశతావధానిబిరుద

ము సంపాదించిరి కాని ప్రకృతము వీరి కాబిరుదము చెల్లదని కొన్ని
పత్రికలకు వ్రాసినయథార్థవాదిసాహస మేమనివర్ణింతుము శ్లో॥ ప్రే
మాన్యోన్యం యావత్ తావద్దోషాః పరస్పరం నైవ॥ కావున నీకల
హమునకు సంఘవైషమ్యమే మూలకారణమని చాలవఱకు వ్యాపిం
చినది-సంఘాభిమానముతోఁ గొంచెముగొప్పఁ జేయ యోజించుటమం
చిదే కాని సంఘవైషమ్యముతో గొప్ప కొంచెముఁ జేయ యోజించు
టమాత్రము ప్రశస్తమైనపనికాదు-కొందఱుభయులరాజీకై య
త్నించుచున్నట్లు వినికికలదు ఆబుద్ధిమంతులు చిన్నతనమునందుండి
యింకను వృద్ధికిరావలసిన కొప్పరపువారిచేతనే పొరపాటనిపించి యు
భయకవులకును సఖ్యమొదఁగూర్పఁ బ్రయత్నింతురుగాక.

కొప్పరపుఁగవులు మొదటఁదిరుపతివేంకటకవుల నెట్లు జయిం
పవలెనని యోజించిరో కాని వారు "మమ్ము మేము పొగడుదుము-మమ్ము
మీరు పొగుడుఁడు-కొందఱు నిర్ణేతలమీరు కోరుకొనుఁడు కొందఱు మేము
కోరుకొనెదము-ఇందఱుంగలిసి మనజయాపజయములను నిర్దేశింతురు" అని
వ్రాసినమీఁద సభసంగతిమానుకొనిరి. ఈనిబంధనలప్రకారము మన
ధానాదులు సలుపలేక యేకాబోలు? మానుకొనిరి "మీరొడ్డిన
మీమీమానములుదీయింతుము మే మొడ్డినమామానములుదీయించుఁ
డని వ్రాయక విధిగా మీమానము లేతీయింతుమని వ్రాసిరి-తుదకెట్లై
నను నాహా! యెంతధైర్యము చేసిరి. ఈకల్లోలము వినివచ్చి వీరి
కి "మీ గంటికలూడఁగొట్టెదను గాచుకొనంగమకింపుఁడిత్తఱికా
అని వ్రాసిన తిరుపతివేంకటకవులశిష్యులగు బ్రహ్మశ్రీ వేలూరి శి
వరామశాస్త్రిగారిని కొప్పరపువారేమి మఱికొందఱేమి లక్ష్యము
చేయకపోయిరి కాని వారు గుంటూరిలో మొన్న జరిపిన సంపూర్ణ

శతావధానము వారికీర్తినివిస్తరింపఁజేయుచున్నది. మరలఁదిరుపతి వెంకటకవుల శతావధానములు బ్రాహ్మణకోడూరులోను దెనాలి నరసరావుపేటలలోను జరిగి యీప్రాంతములఁ బలుమందినిసవధాన సభలు సలిపింపఁబురికొల్పుచున్నయవి. తథాస్తు సర్వేజనాస్సుఖినోభవంతు.

అభినవసరస్వతి పత్రికాధిపతిగారిసముఖమునకు,

కం. శ్రీవేదమూర్తులునవి, ద్యావిషయనిభానులునుశతవధాను
లుసం। భావితదానులునానా, భూవరమానులునుసకలభూసురవ
రులుర్॥

తే॥ అయినశ్రీజానపాటిపట్టాభిరామ, శాస్త్రిగారికిఁబ్రాయఁబడినజ్ఞాన
సములు, నేమమిచ్చటలక్ష్మీనృసింహునకగుణ. వలయుఁబ్రాయింప
మీభవ్యవార్తలెల్ల॥

కం॥ తెదూపరిమాజనకుని పే, రఁదనరి వెల్గొందుపంచరత్నమ్ములఁదా
ముదయింబత్రికలోఁ, జే ర్చెదరనునమ్మికనుఁ వ్రాసి చేరఁబనిచితిఁ

తే॥ తప్పులనుదిద్దుభారమంతయునుమీదె, కాన వేఱుతలంపక ఘనతర
మతి,సవరణలుచేసిప్రచురింపఁజనుమహాత్మ్యమర్మతోఁబ్రదేకవిపులనిస్తు
లకుతార॥

ఇట్లు విన్నవించుభవద్విధేయుఁడు,
గోపాలునిహనుమంతరావు.
అష్టావధాని.

## గోపాలునిహనుమంతరాయకృత పంచరత్నములు.

సీ॥ శ్రీరామచంద్రమూర్తి మహాకథాసుధా
పానవిశిష్టుం డే ప్రథితగుణుండు
ప్రాకటోత్కృష్ట వాల్మీకిరామాయణా
ద్యుద్గ్రంథపఠనుం డేతుష్టహృదయుండు
మేదురసింహ గాంభీర్యవాక్యోద్గాఢ
వైశద్యుం డేమంత్రివంశఘనుండు
స్నాన సంధ్యావందన జపాది నిత్యనై
మిత్తికకృత్యుం డేమేధ్యచరితుం
డట్టి గోపాలునికుల దుగ్ధాబ్ధిపూర్ణ
శర్వరీశుండు శ్రీరామశర్మశాస్త్రి
పదకుశేశయయుగళి నెమ్మదినినిల్పి
పూజలొనరించుచుండు నిర్వ్యాజభక్తి॥

సీ॥ ఏమహామహుని సమీక్షణౌత్సుక్యస
త్సంపద నై మహీశక్తినిచ్చె
నేపావనుని యశశ్శ్రీ సాగదామర
వాహిన్యహాట్సరస్వతులమించె
నేప్రవీణుని లేఖనప్రభాప్రౌఢ్యము
ద్యన్మౌక్తికౌన్నత్యమపహసించె
నేసత్యరతుని విశ్వాసములోకత్ర
యైకమానుష్యవిఖ్యాతిగాంచె

నట్టి.........భక్తి

సీ॥ తత్త్వవిచారసంధానని రూఢతత్త్వ
సరణిని నాదిశంకరుఁడె సాటి
సన్మార్గరక్షదీక్షావిచక్షణవిశం
కటవృత్తిశ్రీత్రివిక్రముఁడె సాటి
అనవరతోల్లసద్ఘనసూనృతవ్రత
శక్తిగంగాతనూభవుఁడె సాటి
లలితనాటకపద్యాలంకారసాహితీ
సరణిని భోజభూవరుఁడె సాటి
యనుచు నెల్లజనంబులు నభినుతింపఁ
దనరు గోపాలునికులాబ్ధి.........భక్తి॥

సీ॥ ధరణిముప్పాళపత్తనవరేణ్యాగ్రశాంత
వాసుఁడే పుష్పధన్వవరతనుఁడు
అప్పయాభిఖ్య సమ్యక్పుత్రపట్టాగ్ర
సంభూతుఁడే భూరిశాంతియుతుఁడు
శ్రీమద్రమణమాంబ చేతస్సరోజన
ప్రాశ్వాసదృక్షుఁడే ధర్మవిదుఁడు
వెంకటనారాయణాంక హనూమంత
నామక జనకుఁడే న్యాయజనుఁడు
అట్టిగోపాలునికుల.........భక్తి॥

సీ॥ శ్రీయుత కీలక హాయన కార్తిక
శుక్లచతుర్థిని శుభముహూర్త
మున ముక్తికాంక్షనీఘనవివాహోత్సవయం
వరమని నాకాధిపతి ముదమున
శుభలేఖవ్రాసి యిచ్చోఁదోడితెమ్మని
చారులఁబంపఁగా సత్వరమున

వారసు దెంచి పుష్పకమునఁ గూర్చుండఁ
బెట్టుక గొంపోవఁ బ్రీతితోడ
మోక్షకాంతను బెండ్లాడి మురియుచుండి
నట్టి గోపాలునికులాబ్ధి.........భక్తి॥
పోతరాజు నరసింహారావు పంచరత్నములు.

సీ॥ గోపాలునికులాబ్ధికుముదాప్తబింబమై
యేను హరిమహాబుడు జనించినాఁడో
అప్పమంత్రికుమారులాగ్గరియందున
నే బుధుండధికుఁడై యెసఁగినాఁడో
రమణమాంబామనోరమణుఁడై యొప్పెడ
ఘనకర్మ శాభిఖ్యఁ గాంచినాఁడో
వెంకటనారాయణాంకహనూమంతుఁ
బడసి యేపుణ్యంబు పరిబలినాఁడో
షడ్వర్గములఁ ద్రించి సర్వసమత
చేతనే శాంతచిత్తుండు చెలఁగినాఁడో
అట్టి శ్రీరామయామాభిఖ్య ననఘ ముఖ్యు
నభినుతిని జేయుచుండెద ననవరతము॥

సీ॥ విద్వత్సమూహముల్ విభ్రమమందఁగా
సంస్కృతాంధ్రంబులఁ జదివి చదివి
పండితనామంబుఁ బడసినవారితో
సంతతసఖ్యంబు నలిపి నలిపి
వాద్వాదములు చేయు దోషజ్ఞచయములు
మందభావం బెల్ల మాన్పి మాన్పి
మార్గణాభీష్ట మనర్గళంబుగఁ దీర్చి
గురుతరకీర్తిని గూర్చి కూర్చి
జోకతోఁ గీలకాబ్దకార్తికశుద్ధ
మునఁ జతుర్థదినంబున ముక్తిఁ గన్న

పరిధితగుణగణపూరు శ్రీరామధీరు
నభినుతింపంగ నెవ్వారికలవియగును॥

సీ॥ ఎంతటియుద్యోగియైనకాని గడియలో వాక్యచాతురివశ
పఱచువాఁడు
ఎంతటిపండితుండైనకాని వాదనస్థితి చేతనటుబటు
చేయువాఁడు
ఎంతటిస్నేహితుండైనకాని లోపమొక్కించుక చేయఁగో
పించువాఁడు
ఎంతటికులహీనుండైనకాని పండితుండైనచో సంతోష
మందువాఁడు
చెప్పఁడనివచ్చువారికిఁ దత్త్వములర
గోప్యములనైనఁ జెప్పెడికోర్కెవాఁడు
నైనగోపాల్ని శ్రీరాము ననవరతము
వినుతి సేయుచునుండెడి వేయుగతుల॥

సీ॥ సంస్కృతభాషనీచారులలాటంబుపైనముసుంగును
బడఁగఁజేసి
తప్పొప్పు లెప్పుడుఁ జెప్పించుకొనుచుండుకవులకుదుఃఖంబుఁ
గలుగఁజేసి
పూరిపుల్లనుబట్టఁబూననిమానుషమంతు బహుళసంసారాబ్ధిఁ
బడఁగఁజేసి
సర్వదిగ్వ్యాప్తపరిశస్తకీర్త్యాకరవంశంబునకు వన్నె
వాయఁజేసి
పృథివివిడికీలకాబ్దకార్తీకశుద్ధ
మునఁజతుర్థిదినంబునను ముక్తుఁడైన
రమ్యగుణధాముగోపాల్ని రామ నామ
మహిని గణుతింపశక్యమే ? మానవులకు॥

సీ॥ నక్షత్రచయములనడుమసుధాధామబింబంబులేనిది

నంబురీతిఁ
బల్లవంబులమధ్యభాగానమంజుఫలంబులేనిసురసా
లంబురీతి
సకలమృగాళిలోఁబ్రకటితపంచాననంబులేనట్టివ
నంబురీతిఁ
బహువిధజలఖగపంక్తిలోధార్తరాష్ట్రంబులేనికాస
రంబుబురీతి
జనములందున శ్రీరామశాస్త్రిలేక
పోయినందుననుప్పాళపాదలుచుండె
నకటయీవ్రరికీలోపమునగుఁబెట్టు
లనితలంచుచున్నాఁడ ననఘులార !

---

శ్లో॥ శ్రీమౌద్గల్యసగోత్రవార్త్తికమణిశ్శ్రీరామశర్మాభజత్
శుద్ధైకైకలకార్త్తికేహిందివసేమూసేహరేస్తత్పదం
విద్యానర్థిషుకల్పకస్త్రిభువనేవిఖ్యాతచారిత్రవాక్
పుత్రీమాతృపితృప్రియాగ్రతనయశ్శ్రీయోర్థిభిః ప్రార్థితం

గద్య॥ బతాయంజతయువతీవిజయవాసనోపిరామానందకరః-సుబా
హురపిమారీచమాయావిముఖః-జితక్రోధోపిలుంఠితరిపుకం
ఠః కటురపిరాజసగుణప్రియః-సుభగోపిస్వసుందరీవిముఖః
రామోపివిశ్వామిత్రప్రియః సురూపాత్మోపివిరూపాక్షప్రి
యతమః-వామదేవఇవజితకామః-రామఇవలక్ష్మణాగ్రజః-భీ
మఇవధర్మార్జునప్రియోతీవబభౌ——

ఏవం-బొగ్గరంశ్రీరామశాస్త్రి.

వస్తుతస్త్వయంసజ్జనస్సంస్కృతాంధ్రభాషా
జ్ఞానవాంశ్చ-పరంతుపుత్రమిత్రాదిభిరత్యంతం
వర్ణితఇతిసర్వంసమంజసం॥

పత్రికాధిపతిః.

# నరసరావుపేట యవధానము

ఈనెల 1-2 తేదీలలో మాపురమునఁ గింకపేంద్రఘటూపంచానులగు బ్ర॥ తిరుపతివెంకటేశ్వరకవులు శతావధానాష్టావధానములు సలిపి పౌరులనానందవారిధి నోలలాడించిరి. సంపూర్ణశతావధానమే జరుగవలసినవరుసకు మూడో తుదకు రెండయినను దివసములు చాలకైయుకావలసియుండు-అంతకాలము వారు విద్యాభిమానము వదలలేక యాయాసమునకోర్చి చెప్పనుప్పుకొన్నను బాగులకేయయ్యది కష్టమనిపించి మొదటినదిము 40 మందికే చెప్పుటకియ్యకొనిరి-ఆ 40 మందికైనను 4 చరణములు పూర్తియగుటకుఁ జాలరాత్రియగునని సభికులయభిప్రాయానుసారముగ సభాధ్యక్షులగు శ్రీ కాశీకృష్ణాచార్యులవారు పాదద్వయపూర్తికే పర్మిషనీయనట్లే యూపరించి మరుదినము ప్రాతఃకాలమునసే తక్కిన రెండుపాదములును బూరించి పృచ్ఛకులు కోరినట్లెల్ల నాయానెంబరు పద్యములు చదివిరి. చెప్పుటలోనైనను వీరిధారణాబలమును గనుఁగొనుతలంపుచేఁ గొందఱు మూనెంబరు పద్యమునుఁ జెప్పుఁడన వరుసవదలి యట్లేయడిగినట్లెల్లఁ బూర్తిచేసిరి-అవధానము మరునాఁటికి శేషించుచో నాశేషించినభాగమును నాఁటిరాత్రి పూర్తిచేసికొనుటకవకాశముండునని మనమూహింపవలసినసంగతియేకాని యయ్యది ప్రథమదినము పాదద్వయపూర్తికూడఁ జేయక వదలినప్పుడను మానించవలసిన విషయమైయున్నయది-ప్రథమపాదమందలిపదం జెప్పి వృత్తమును నన్వయమును భేదించకుండ రెండవపాదమెప్పుడుపూర్తి చేయఁబడునో యప్పుడేధారణనిలిచినదనియనుకొనుటకు సందియముండదు-ఈ యవధానమున ౫-౬సమస్యలుకూడఁ బూరించిరి ఈయవధానమిట్లగుడు మరునటిదినము 3 గంటలకారంభింపఁబడి యష్టావధానము గూడ నాచరింపఁబడియె. అందున్యస్తాక్షరములో నిచ్చినయక్షరము మరలనిచ్చుటయును నొక్కటి మొదటకేయీయక పోవుటయుఁ దటస్థింపదానింగని పెట్టి తత్పద్యముం జెప్పివేసిరి-ఘంటాసంఖ్యాకథనములోఁ గొంతభేదమువచ్చినను నెక్కువసంఖ్యవారి మొంపకము వారుచెప్పిన సంఖ్యకే సరిపోయియున్నది. ఇట్లునిర్విఘ్న

ముగ నవధానముపూర్తియైనపిదప నగరిసనాధిపతి మొదలగు పలుమంది పండితులు పలువిధముల వారిపాండిత్యాతిశయమునుఁగొనియాడిరి-నాఁటిదినము డిప్యూటీకలెక్టరులగు మహారాజశ్రీ విష్ణుభట్లరామకృష్ణయ్యగారు, తహశీలుదారులగు మహారాజశ్రీ రావులపాటిచెలపతిరావుగారు మొదలగు పలుమందియుద్యోగస్థులును బ్లీడర్లును ననేకమహాజనులును సభ నలంకరించియుండిరి-అప్పట్ల బ్ర॥ రావిప్రోలుసుబ్బారావుగారు లేచి వీరిపైనసూయచేఁ గొందఱుసత్యవాదులను పేరుతో నసత్యప్రకటనలు చెయుచుండిరి-కావున నేఁను జరిగిన యంశములకు భిన్నమైన వ్రాఁతబడులు దేరునప్పు డీసభ్యులెల్లరును సాక్షులుగానుండవలసివచ్చునని చెప్పిరి-అంతట జయజయధ్వనులతో సభముగింపుచుఁగవులకు నూటపదియాఱులు బహుమానముసలిపిపంపించిరి-ఈయవధాన మధ్యమందొక పృచ్ఛకుఁడు "పశ్యాపశ్యౌనపశ్యతి" అనుసమస్య నీయ నీసమయమున నిట్టిది యిచ్చుటతప్పను నభిప్రాయముగునట్లుత్తరంబొసంగిరి-తప్పుకాఁదు తప్పంటిరి కావున మీరదిసమర్థించుకొనక తప్పదని కొందఱువ్రాయుచున్నారు తప్పుకాదనినిరూపింపఁగలవారికే మేము జవాబియ్యవలసినవారమని వారొక్క-టేనారి వ్రాసిరి, సర్వనసానం బెట్లుతేలవలసియున్నదో తెలియదు. 4వ తేది పైయవధానులు రైలుకేగువేళ మ॥ శ్రీ॥ రూపెనగుంట్ల హనుమంతరావుగారు 7వ తేదిని శతావధానముఁజేయుంతుము కాన మీ యభిప్రాయము వ్రాయుఁడనియొక లేఖ నంపిరి. వెంటనే వారు చెసినప్రయాణ మాపక గుంటూరుకు వెళ్ళిపోయిరి 7వ తేదీ బాపట్లలో నవధానముచ కొప్పుకొనియుండిరఁట. ఏమి జబాబత్తురో తెలియదు. ఈయవధాన సమారాధనోత్సవమునకు ముఖ్య కారకులైన మ॥ శ్రీ॥ పంగనామాల నరసింగరావుగారు పొనుల కృతజ్ఞతకుఁబాత్రులగుచున్నవారు.

చావలి వెంకటకృష్ణయ్య
బి. ఏ. క్లాసుస్టూడెంటు

గరువము జెందకున్న నొక కాలము నందొకరో మతిర్వరో
వఱలుటగాక నల్వురును వతిఁగాలు ఎంతటి భాగ్యమద్దిరే॥

(28) నిర్గుణ బ్రహ్మము

చ॥ సకలజగంబు నిర్మితినిసల్పియు దానికి నంటకుండుటం।
బ్రకటముగాఁగఁ బద్మదళమధ్యము నందన రారునీటిపో।
లికసలరారు నాతనికి లేశము చుట్టము శత్రువంచు లేఁ
డకట! పరాత్పరుండనఁగ నాతఁడె నిర్గుణుఁడన్న నాతఁడే॥

(29) సమస్యాపూర్తి:

క॥ రవివంశభవుఁడు రాముఁడు।
శివకరుఁడగు నింద్రు కతనఁ జెచ్చెర నమృతం।
బు వడం జేసిన వానర
(శవములు జీవించియుంటసంభవమయ్యెన్॥)

(30) అవధానము పరమునకు సాధనమా!

కవిరా॥ జనులవధానము సాధనమా పరసౌఖ్యముఁ జెంద నసాధనమా!
యని వివదింతురు కొందఱు పొట్టకునై యది వెచ్చఁగఁ బెట్టినచో
జనులు పరంబునుగాంచఁగ నేరరు సర్వము నీయవధానపుశ।
క్తినిబరమాత్మను నిల్పినవాని కౌగిన్ ఘటియించుఁబరస్ఫురణల్

(31) భారతమునుగూర్చి

ఉ॥ సారవిమల్ కవీశ్వరులు చక్కనిలక్షణమంచుఁ బెద్దలా।
వారితిహాసమంచు నయవాదులు న్యాయనిదానమంచు నే।
భారతమున్ గణింతురది బాసకు మూలము దానిఁదెల్గునన్।
దారిచినారుగా! మురుపు నన్నయ తిక్కన యెఱ్ఱనార్యుఁడున్॥

(32) అధికారమునకు మించినరీతి

క॥ తనకుండిన యధికృతికిన్।
మినుమిక్కిలిగాఁగఁ గీడుమే లెంచక యే।
జనుఁడు ప్రవర్తించునో యా।
తనికిఁబరాభవమురాక తక్కంగలదే॥

### (33) కొండవీడు.

ఉ॥ మానిసులెంత యేని బలమాన్యులుసత్కవితావదాన్యులున్
ధీనిధులున్ బ్రతాపగుణదీధితిమంతులు రాజులున్ మహా
స్థానములున్ జెలంగఁగ విదర్భముఖప్రతిపాల్యమాన్యమై
మానుగఁగొండవీడు మునుమాన్యయశంబుగనేధరాస్థలిన్ ॥

### (34) భోజకృష్ణరాయలకుఁ బోలిక.

శా॥ ఆతండుంగవియాతఁడుంగవియె విద్యాపక్షపాతంబునా
దాతండీతఁడుగూడఁ బేర్పడి వదాన్యత్వమ్మునంబొల్చె ప్రౌఢప్ర
ఖ్యాతింగాంచిరి మున్ను సంస్కృతమునొక్కండాంధ్ర మొక్కండు
ఖ్యాతింబూంచిరి భోజకృష్ణనృపతుల్
గణ్యుల్ ప్రశంసింపఁగన్ ॥

### (35) ద్వీపాంతరవాసశిక్షకు సంతోషించుట.

శా॥ నావంకన్ గనుపట్టుజడ్జి కరుణాసన్నద్ధ్యంబు నాకేసు నేఁ
డే వీడున్ ధ్రువమంచు నెంచు నెడఁ దీర్పిచ్చెన్ బరద్వీపము
బోవన్ దానురిశిక్షదాఁటునని సమ్మోదంబు ప్రాపించె వాఁ
డే వాకన్ బ్రతుకుండుటేతనకు నెంతే శ్రేయమంచెంచుచున్

### (36) ఈ గుంటూరుఘస్టునాటకశాల.

శా॥ సంగీతంబునుసాహితీగరిమ నిచ్చల్ పుంజపుంజమ్ములై
పొంగారన్ బుధపాదపద్మరజముల్ భూషింపనాట్యావనీ
రంగంబై తతరంగమై వెలయు గర్వంబుచుఁ బేర్గొన్న యీ
రంగళ్యాణపునాట్యశాల సుమనః ప్రాజ్ఞైకసంవాసమై ॥

(37) అవధాన మొకరుచేయుట కష్టమా! యిద్దరుచేయుట కష్టమా
కవిరా॥ ఒకకవిసేయుటయొండొకసౌఖ్యము, యొండొకసత్కవితోనవధా
నకవితఁజెప్పుట సంకటమానొకనాయకుఁడుండుట సౌఖ్యము వే
ఱొకరుఁడునాయకుఁడుండిన సౌఖ్యమదొప్పదు దీనికినేఁటిసభా
ధికృతినిదర్శనమీవిషయంబు మదిందలపోయుఁడుసాధుజనుల్॥

(38) అమరావతి సమరావతితోఁ బోల్చుట,

మత్తకో॥ ఎందఱో విబుధోత్తముల్ మఱియెందఱో కవిరాజులున్
ముందు నిప్పుడుఁ గూడ నయ్యెడఁ బొల్చుచున్న కతంబునన్
సుందరంబమరావతీపురి చూడ స్వర్గము నాఁగ సం
క్రందనుండన వాసిరెడ్డి నృకాంతుఁడున్ దనరారుటన్॥

(39) బుద్ధికిఁ జంద్రునితోఁ బోలిక.

శా॥ ఆరన్ బుద్ధియుఁ జందురుండు నొకటే హాళిం బ్రవృద్ధింగనున్
దారానాథుఁడు బుద్ధియున్ క్రమముగాఁ దైక్ష్ణ్యంబు వోనాడి వి
స్తారక్షీణత నొందుఁ జంద్రునకు నెంచన్ బుద్ధియే సాటి యే
రూరీకారము సేయకుందురు బుధుల్ యోగ్యప్రచారుల్ మదిన్॥

(40) అగ్రాసనాధిపతి.

శా॥ శ్రీకాశీకుల కృష్ణమార్యసుకవి శ్రేష్ఠుండు ధన్యుండు వి
ద్యాకల్పద్రుమ మీసభాస్థలికి నధ్యక్షుండుగా నెట్టులో
నీఁకన్ దిర్పతి వేంకటేశ్వరులు ప్రావీణ్యంబుఁ జూపించిరో
శ్రీకిన్ బండితులే సమస్తగతులన్ శ్రేయఃప్రదాతల్ సుఁడీ॥

(41) సమస్యా పూర్తి.

శ్లో॥ సఖే మయి ప్రీతిభరాలసాఽపి
రుదంతమాలోక్య శిశుం మృగాక్షీ
తదా మనో యచ్ఛతి భాగశస్తత్,
ప్రయాసు తం నోఝ్ఝతి కామతంత్రే॥

(42) పూర్త్యంతరం.

శ్లో॥ షండః పుమాన్ కశ్చన భాగ్యశాలీ
వృణోతు కాంతా శ్శతశోఽభిలాషాత్
గృహస్థమేనం రచయంతు వా కా
ప్రయాసు తం నోఝ్ఝతి కామతంత్రే॥

(43) సమస్యా పూర్తి.

ఉ॥ ఇంతిమనోజవేదనకు నించుకయుఁ సహింయింపలేక దు
ర్దాంతతమోభరంబడరు రాతిరి దా నభిసారికాత్వవి
విక్రాంతికిలోఁగిపోయి ప్రియురాకహులికిఁగఁదోఁపనంతలోఁ
(గాంతుఁడులేనివేళఁగలకంఠి కిలక్కున నవ్వెఁగిన్కతోఁ॥ శ్రీ శ్రీ

అవధానాంతమున నగ్రాసనాధిపతి మొదలగు వారుచెప్పినవి,

శ్లో॥ శ్రీ వేంకటాద్రినాథాయ శ్రీవత్సాంకితవక్షసే
శ్రీభూనీలాసమేతాయ శ్రీనివాసాయతే నమః॥

సీ॥ పదిమందిలోఁ బట్టపగలైన
నిలువెల్లదోఁచి • దోఁచని పచ్చిదొంగవాఁడ!
పరికైనను దిరుక్షౌరమ్ముచేయించి
పంగనామముఁబెట్టి పంపువాఁడ!
వడ్డిలోఁగాసైన వదలకంతకునంత
గుంజి గైకొనురాతిగుండె వాఁడ!
కడుఁబేదనని మొఱ్ఱలిడ నెత్తి
బొచ్చెనఁబెట్టి పొమ్మని యడ్డుపెట్టు వాఁడ!

తే॥ గీ॥ పేరుగొప్పయె చూడఁగ నూరుదిబ్బ
యనెడు నాయంబునకు లక్ష్యమైనవాఁడ
సరసతిరుపతి వేంకటేశ్వరులతోడ
మమ్ముదయఁజూడు మలమేలు మంగ జేఁడ॥

చ॥ వరమృదుళాశుధార రసబంధురబంధప్రబంధబంధనో
త్కరకవితర్కమతిశ్రమసిధానవధానవిధానచాతురిఁ
దిరుపతి వేంకటేశ్వరులెధీరులు సూరులువీరులంచునే
విరివిగవింటిమున్నిపుడు వీరిని గంటిని గంట నీసభఁ

ఉ॥ అద్దిరయాశువాగ్ఝరి యయ యయారె! వధానవిధమ్ము బాపురే
ముద్దులుగుల్కుపద్దెములు ముత్తెపుగుత్తులెమాటలౌ సెబాస్

తద్దయుఁ గ్రంథశైలియమృతమ్మను జుమ్మనుజుమ్మ వీరికే
రుద్దిజగాన, నొండొరుల కొండొరు లేసరిగాక లేరిఁకన్

చంపకమాలిక,

తలిరుపసిండిపూఁతనునుదళ్కులఁజెక్కడు గుల్కులాఁడిమై
జళుకుపిసాళి గందపుఁబసందులయందము లొంద నొక్కచో
బలుజిగిగల్గుఁగ్రొంబసిఁడివన్నెలకన్నెల చిన్నిపొన్నచ
న్నులఁగయిఁబట్టి నప్పటివినోదము మోదమునూదు నొక్కచో
వలపులనీనుకప్రపుటనంటుల మింటికి నంటగెంటుతో
య్యలినునులోఁదొడన్ గదియనందినచందమునందు నొక్కచోఁ
దొలిమగసేఁతనాఁడొసఁగు తొయ్యలిగాటపు నెయ్యపుంగవుం
గిళులఁగలట్టియొత్తుడుల క్రిందగునందము చిందు నొక్కచోఁ
దెలుఁగునఁగైతమల్లఁగలదిట్టలు తిర్పతివేంకటేశ్వరా
ఖ్యులనుచు గాశికృష్ణకవి యుత్పలచంపకమాలికావళిన్
బొలుపుగఁగూర్చి యెల్లరును మోదము నొందఁగ విద్వయోగళిం
బులఁదవిలించెఁబండితవిభూషితగత్ర్వపురీసభాస్థలిన్॥

ఉ॥ వీరలధారణాపటిమ వీరికవిత్వపటుత్వపుష్టియున్
వీరలయాశుధారమఱి వీరలమాటలలోని తేటయున్
వీరలమైకమత్యమును వీరికవిత్వము నందభేదమున్
వీరికిఁదక్కనింకఁ బృథివీస్థలి నన్యులకుండఁజాలునే॥

ఉ॥ ఇంకఁబదేపదేయిటుల నేల నుతింపవెఱ్ఱిగా "కలౌ
వెంకటనాయకో" యనుట వీరలెగా! కవనంబొనర్చువా
రింకొకరుందురే యనుచు నెంతయుఁ బేరువహించినట్టి శ్రీ
కింకవిరాజమత్తగజకేసరి తిర్పతివేంకటేశులన్॥

ఉ॥ ఇక్కలికాలమందు ధరనింతటివారు కవిత్వమందు వే
ఱెక్కడలేరుసుమ్మనుచు నెక్కడవిన్నఁబ్రసిద్ధిగాంచి పెం
పెక్కిన యాకవీశ్వరులకిట్లు సభన్ బొనరించునప్పుడే
యొక్కవతెన్ జమీందునుచు నెక్కిలి నుత్తమవీర మిత్తజిన్॥

*బ్ర॥ శ్రీ॥ శిష్టా సీతారామశాస్త్రిలవారి శ్లోకములు*

శ్లో॥ ఏతత్పూర్వకవరోదితేషు బహుశః పద్యేషు సర్వేష్వహో
దృశ్యంతే హ్యుపమాదయోఽపి సుగుణా ఓజః ప్రసాదాదికాః
సామర్థ్యం స్ఫుటతా గిరాంచ గురుతాభివ్యార్థతా స్వీకృతా
నూనం తిక్కనసోమపాదికవిభిస్తుల్యా ఇమే సూరయః॥

శ్లో॥ శాంత్యాదాంతిగుణేన కీర్తినిచయైర్యుక్తాస్తపోవిద్యయా
శ్రీ అభిర్వాక్యపదప్రమాణనికరైః ప్రావిద్యాస్సతాం సమ్మతాః
గద్వాలేపి పితాపురే చ నగరే చెన్నాపుర్యాం సత్కృతాః
పూజ్యంతే స్మ పురే పురే బహువిధం గుంటూరుపుర్యాం యథా॥

శ్లో॥ శ్రీ గుంటూరుపురే పరే నివసతా శిష్టాన్వయాంభోధినా
సీతారామసుధీవరేణ రచితా వాగ్గుంఫపుష్పాంజలిః
శ్రీమచ్ఛేషగిరీంద్ర వేంకటరమానాథోత్తమాంగేర్పితా
సంతుష్ట్యై దిశతాద్బహూన్ శశికలా శుభ్రాన్ గుణానేమచిరం॥

శ్లో॥ విద్వద్భిః కవిభిస్సభాస్థితజనైః పూర్ణావధానైర్మహా
జల్లాన్యాయసభాసప్లీడరువరైస్సంపూర్ణసంపద్యుతైః
వీణావాదనతత్పరైస్సుబహుభిస్సాశాబ్దికైస్తార్కికైః
శ్రీగుంటూరుపురీశరం విజయతే సర్వోత్తమాగాయకైః ॥౪॥

బ్ర॥ శ్రీ॥ శిష్టా హనుమచ్ఛాస్త్రిగారివి.

ఉ॥ చిన్నతనమ్మునందె గురుసింహుల సేవలొనర్చి సాహితిన్
గ్రన్నన నేకరించి ఫణిరాజముఖోదిత శాస్త్రపాండితిన్
మిన్నదనంబుగాంచి బుధమిత్రములై పొరలేని చెల్మి వి
ద్వన్నుతులైన పూర్వకవివర్యుల లీల నిలింపభాషలో
నెన్నియొ గ్రంథముల్ సలిపి యిర్వురుముర్వగ నాంధ్రభాషలోం
బున్నియమొంతొ చేసికొని పుట్టినసత్కృపులంచు నెన్న నా
సన్నయ తిక్కనాది కవినాథులు పోయిన పోకలున్ రసా
భ్యున్నతి గల్గు కబ్బముల నోపినయన్ని రచించి యంతకున్

మున్నిశతావధానము లమోఘమనీష నశేషభూవరా
త్యున్నతసత్సభాస్థలుల నొప్పఁగఁజేసి స్వతఃప్రకాశు"లన్
సన్నుతులంది దుష్టకవిసామజసింహులుమున్నుగాఁగ నె
న్నెన్నొ యశఃపతాకలసహీనబుధుల్ పరికించియీయఁగాఁ
బెన్నిధులన్ బలెంగొనుచుఁ బెక్కుబహూకృతులంది. వహ్వారే
వెన్నెలఁబోలుకీర్తి పృథివీస్థలి నాశశితారకంబుగా
నన్నువహింప నెల్లెడల వ్రాసి మనోజ్ఞముగాఁగ మేలుమేల్
చిన్నెలమున్న నంగసిరి శ్రీపతి వేంకట సత్కవీశ్వరుల్
కన్నులపండువై చెవికిఁ గౌతుకముప్పతిలంగ నేఁడు శ్రీ
మన్నరసాహులార! మతిమత్సభఁజేసిరహో! వధానమున్
జెన్నువహింపమగర్తపురి శ్రీముఖపద్మములందుమించ న
స్సన్న! మహాత్ములీకవివరాగ్రణులన్నిట మిన్నలేసుఁడీ ॥

ఇట్లు,
శిష్టా హనుమచ్ఛాస్త్రి, టపుక్ హైస్కూల్ తెలుగుపండితుఁడు.

బ్ర॥ శ్రీ॥ బజ్జేపల్లి లక్ష్మీకాంతకవిగారివి.

చ॥ తిరుపతివెంకటేశ్వర సుధీమణులార! శతావధానదు
ర్ధరకవితాప్రచారచణతాజనితాఖిలదిక్ప్రపూరిత
స్ఫురితయశస్కులార! పరిపూర్ణకళానిధులార! నా నమ
స్కరణము శిష్యవత్సలతఁ గైకొనుఁడీ వినుఁడీ మనస్సులన్ ॥౧॥

కం॥ చిరకాలమునకు మీరీ
పురికేతెంచితిరటంచుఁ బొంగుచు మిమ్ముం
దరిసింపఁగూడుపౌరుల
పరమానందంబు మీరె వర్ణింపఁదగున్ ॥౨॥

మ॥ కలముంబట్టి కవిత్వమల్లుబుధులో క్రొంబెల్ల వేనోళ్ల మీ
లలితంపుం గవితన్నుతించి రుచిరాలంకారముల్ భాషలో

పలిమేల్పల్కులఁగొల్లలాడె నిఁక నేవర్ణింతు నేనిన్ దదు
క్తులనే యేకరువెట్టఁగావలయుఁ బంక్తుల్ పౌనరుక్త్యంబుగన్ ॥౩॥

శా॥ పౌనఃపున్యముగాఁ బురాకృతములన్ వల్లించుకంటెన్ సదా
మానంబూని సుధారసంపుఁజవులన్ బాటించుమీకైతలన్
వీనుందోయిటిచేతఁ ద్రావుచును దృప్తింజెంది యద్దాన బ్ర
హ్మానందామృతవార్ధిదేలుటయె మేలంచున్ దలంతున్ మదిన్ ॥౪

ఉ॥ అట్టిదిగాక నోటిదురదాఱఁగ మిమ్ము నుతించిమాత్రమే
పట్టముగట్టిపెట్టుదును ! బావనమౌ భవదీయవాసికిన్
గట్టమె యీయనెంచిననొకానొకపట్టణమేమిచాలు ! మీ
యట్టికవీంద్రులీయవనియంతకుఁ జాలినవారు కారొకో ॥౫॥

సీ॥ మహితగద్వాల రామక్షితీంద్రునిభాతి
బాగారుబిరుదు లొసంగఁగలమె
ఆత్మకూరునృపాలు నట్లుపొంపిరివ్రావ
ద్వీపమహోత్సవము గావింపఁగలమె
ఆనందగజపతి తమ్మనాయకునిరీతి
వెలలేనికాన్క లర్పింపఁగలమె
పోలవరంపుభూపాలులీల సతంబు
చింతితార్థములఁ బూజింపఁగలమె

తే॥ గీ॥ ఎడఁదలనసూయ కేమిఁ దావీయకుండ
గుణముగ్రహియించుటే పదికోట్లుమాకు
ధనులకంటెను సద్యశోధనులు ఘనులు
సరసతిరుపతి వేంకటేశ కవులార ॥౬॥

మ॥ ఒకఁడో యిర్వురొ కాని తొల్లి నవధానోద్యోగమున్ బూనిచ
న్నకవుల్ పెక్కురు లేరు మీరు మొదటన్ మార్గంబుజూపింపనూ
రికి వేమందిశతావధానులయి పేర్మిన్ గైతచే నాంధ్రమా
తకుఁగల్పించుచునున్న వారిపుడనంతంబైన సంతోసమున్ ॥౭॥

మ॥ పదియాఱేడులక్రిందఁ నొక్కపరి సంభావించి చుట్టంపుఁజూ
పొదవన్ నాఁటికి నేఁడువచ్చియును నొండొరొండొమాసంబులై
న దయన్నిల్వక వీరలిట్లు చనుచున్నా రంచుఁ జింతింతు వే
మది యాబందరు కాకినాడ కగుపుణ్యావాప్తి గుంటూర్పురీ॥
చ॥ తిరుపతి వేంకటేశకవిధీవరులార! నిరంతరంబు నా
తిరుపతి వేంకటేశ్వరుఁడె దీర్ఘతరాయువొసంగి మీకు సు
స్థిరవిజయంబొసంగుచు విశేషయశంబొడఁగూర్చుఁగావుతన్
మఱవకుఁడయ్య మమ్ము బుధమాన్యులు మీకివె
[మానమస్కృతుల్॥

ఇట్లు,
బలిజేపల్లి లక్ష్మీకాంతకవి,
ప్రొప్రైటరు చంద్రికా ప్రెస్, గుంటూరు.

బ్ర॥ శ్రీ॥ శతావధానులు ములుకుట్ల వెంకటకృష్ణశాస్త్రులవారివి

చ॥ వరసుమనోగణంబున కవారితమోదము సంఘటించు నీ
తిరుపతి వేంకటేశుల కుదీర్ణకళాఢ్యుల కేను భక్తి సం
భరితసువర్ణపద్యఫలవర్గము కానుకగాఁగ నిత్తు చం
దురునకు నూలుపోగు బరితోషము మీఱ నొసగు కైవడిన్॥
కం॥ అవధానులకవధానులు కవులకు గవులైన యీజగద్విదితులనే
దవిలి ప్రశంసించుటగన రవినద్దమునందు జూపటకుఁ జూపుటగున్
మ॥ మునువాల్మీకి గ్రహించి రామకథ నీభూలోకమున్ నిండజే
సినచాయన్ మును పెవ్వరో యెరుగ వాసింగొన్న యీవిద్య నీ
జనవర్యుల్ గ్రహియించి దేశముల పైఁజల్లన్ విజృంభించె నిం
పెనయన్ దీనికి మార్గదర్శకులు వీరేగాదె చర్చింపఁగన్॥
చ॥ గురుతరబుద్ధిశాలురగు గుంటురివాసుల కెల్ల వారికిన్
ధరణి సమస్తదేశపరితఃప్రసరచ్ఛశిరుగ్యశోలస
త్తిరుపతి వేంకటేశకృతదివ్యవచస్కశతావధాన మ
బ్బురముగఁ జూడఁగాఁ గలిగె పుణ్యమిదింతని చెప్పశక్యమే॥

కం॥ శ్రీకృష్ణుండనదగు కాశీకృష్ణాచార్యవిబుధశేఖరుడు సభాం[ద్రా
గ్రగొనుటయాధిపత్యము|ప్రాకటహేమమున కబ్బుపరిమళముగ

మ॥ రసమా లోపము లేదు, సాహితియు శాస్త్రజ్ఞానమా పూర్ణము
ల్లసితోద్యాగ్విఖరి తేట, కల్పన మహాలాలిత్య మొప్పారు, నె
క్క సమాధారణయా శిలాక్షరము, నిక్కంబౌరయీవీరితో
వసుధన్ సామ్యమునొందువారెవరు వహ్వా! వీరికిన్ వీరెగా!

మ॥ నిటలాక్షాంగతటోజ్జ్వలన్నిలయనిర్ణిద్రాతి భద్రాయితో
త్కటలావణ్యతనూవిశేషవిలసద్గౌరీకృపాసారసం
ఘటితానూనశతావధానకవితాక్రాంతాత్ములౌ వీరికిన్
పటుదీర్ఘాయువు శేముషీబలము శ్రీప్రాణేశ్వరుండిచ్చుతన్ ॥

సీ॥ ఏవారిదివ్యశతావధానజ్యోత్స్న
విబుధచకోరతృప్తి నిఘటించె॥
నేమహామహుల యహీనబుద్ధిబలంబు
సకలజనాళి కాశ్చర్య మొసంగె
నేగురుభక్తులకిల నెల్ల సభలలో
విజయునకుంబలె విజయమబ్బె
నేగుణాఢ్యులవక్త్రభాగంబు భారతీ
నాట్యస్థలంబౌసనంగనొప్పె॥

తే॥ గీ॥ సట్టిపరిపూర్ణదివ్యశతావధాను
లలరు తిరుపతివేంకటేశులు పొసఁగ
నట్టియీయవధానంబు నభినుతింప
శక్యమెవ్వారికగు మహాసభికులార॥

ఇట్లు.

ములుకుట్ల వెంకటకృష్ణశాస్త్రి శతావధాని.

బ్ర॥ శ్రీ॥ చక్రవర్తుల సుబ్బారాయశాస్త్రియను విద్యార్థి చెప్పినవి,

శ్లో॥ సిద్ధాః కాలగళోత్తమాంగజ జటావాటీస్థితేరాగతా
బద్ధప్రాంజలినా భగీరథమునే ర్గంగామపశ్యం స్తథా

గుంటూర్పత్తనవాసినామధిసభం సంతోషసంధాయినీం
పశ్యామ్యాత్ర శతావధానకవితాకల్లోలినీం సత్కవీ॥1॥

సీ॥ కవనమల్లుటకష్టమన్న నందులోనాను
కవనమత్యంతంబుకష్టమావ
ధానంబుసేయ నిదానమ్మెయుండదు
మనసందులోమధ్యమధ్య వెనుక
మీరుదేనికొ చెప్పినారుపద్యముదానిఁ
బఠియింపుడన్న నేభాసటంచుఁ
బాడితాళినుతింప బఠియించిధారణ
యింతేనిబోసుండ నెంతకఠిన

తే॥ గీ॥ ములయినసమస్యలను బద్యములను శతవ
ధానములఁబూర్తిఁ జేయు మేధావి శేషు
లెచట భూమిని లేరనియే వచింతు
సరసతిరుపతి వేంకటేశ్వరులుదక్క॥

మ॥ కవనంబల్లుదురెల్లకష్టపడి వేంకట్రామకృష్ణుల్,పరా
భవముంబొంది రొకప్డు యానమను నాపట్నంబునన్ డాబులన్
బన్రులంగొట్టిన యంతనే తులితు లవ్వారెట్టు లివ్వారికిన్
గవనంబాదవధానమందు లవముల్ గారన్నఁదప్పౌనొకో॥

చ॥ తిరుపతి వేంకటేశకవితిక్కనలార!యశఃకలావతీ
ధరణసమర్థులార!కవితా వనితావితావితాహితా
వరలపితాళులార హితపంకజమిత్రములార! నానమ
స్కరణపురస్సరంబుగ నొసంగిన పద్దెములన్ గ్రహింపుడీ

ఇట్లు
చక్రవర్తుల సుబ్బారాయుఁడు,

*శ్రీరామాయనమః*

శ్లో॥ యత్కీర్తిస్థలనాంనిశాపరిబృఢః ప్రాప్తుంకళంక్యత్వమో
ప్రీడాదోష్యమతలం సమేత్యతుహినవ్యాజాదరోదీద్భృశం

శేషోఽధోగతవాన్ జుగోప ఖధునీ శంభోర్జటాయాంతనుం
సాతత్తిర్పతి వెంటేశ్వర కథా మాంపాతు పూతాసతీ॥

*బ్ర॥ శ్రీ॥ తిరుపతి వెంకట కవులకొసంగిన పంచరత్నములు,*

సీ॥ జగదాల వాలంబు శాస్త్రపాండిత్యమున్
శాతమౌ కత్తిచేఁజక్కఁ బఱచి
కాకవిమద తృణకాండమెల్లనుగాల్చి
ముల్లోకములుగొప్ప యుల్లఁబెట్టి
కవితానదీరసకాండంబుచేఁబద
సిచ్చి యేకవివరు లెసఁగ నాత్మ
కీర్తిలతనునాటఁ బూతిఁగా నదియల్లి
బిల్లగ నల్లి రంజిల్లఁ బూసెఁ॥

తే॥ గీ॥ శశివిబుధధునీశే ప్రసవముల నవి
తలనుగళమున ధరియించెదలఁపనిసుఁ
డట్టితిరుపతి వెంకటాఖ్యకవిముఖుల
కీర్తిలత నన్నగా బ్రహ్మకేనిదరమొ॥౧॥

మ॥ చతురంభోధి పరీతసర్వధరణీచక్రస్థభూపోత్తమా
గతతానల్పకిరీటకోటిమణి సంఘాతేనమాలామహో
ద్యుతివిస్మేరపదారవిందులగు కవ్యుద్ధామగర్వాటవీ
హుతభుక్తుల్యుల నీ కవీశ్వరుల నెట్లో చూచుటబ్బెంగదా॥౨॥

చ॥ పరఁగననంతసారగుణబద్ధసుధీ మథనాద్రిశాస్త్రదు
గ్ధరసధిలోడనోద్భవవితేల్య మహాకవితామృతంబునీ
తిరుపతివెంకటేశ్వర సుధీవరులెల్ల బుధాళికిచ్చుచుం
డిరి బుధవైరిగర్వము గణింపక మాపుమఁ గాన గ్రోలుఁడీ॥3॥

ఉ॥ ఏకవిధాతృజహ్వాలను నెప్పుడు వాణియులంక్రియావళిన్
పేఁక ధరించియుక్తి భవనిస్వనకైతవనూపురధ్వనుల్
పైకొనలాస్యముల్ విబుధవారము పేర్కొన నల్పుచున్నదో
యాకవిసింహులన్ గృతరసాకరకోవిదు నేనుగొల్చెదన్॥౪

సీ॥ వ్యాకరణంబున వక్రభావము లేక
యున్న శేషునిసాటి నెన్నవచ్చు
తర్కశాస్త్రమున గౌతముని జోడనవచ్చు
జోద్యంబుగా నేల జూడకున్న
కవితను వాల్మీకి ఘనునినీడనవచ్చు
మానభావము నెప్పుడూనకున్న
కళలఁ బోల్పఁగవచ్చుఁ గ్రతుభుగుపాధ్యాయు
దోషాకరునకుఁ జదువిడకున్న॥

తే॥ గీ॥ అట్టితగ్గులున్నట్టి వాఁడిట్టికవుల
కెట్టుజత యౌదురే యని యొప్పుబుధులు
నుతులుసలుపఁగనె గడెక్కు రతులమతుల
నలరుతిరుపతివెంకటాఖ్య కవిమణులు॥౫॥

ఇట్లు బుధజన విధేయుఁడు
శ్రీ బెల్లంకొండ రామకవీంద్ర శిష్యుఁడు, పిరాట్ల వెంకటప్పయ్యశాస్త్రి.
(గురిజాల తాలూకా చింతపల్లి.)

క॥ శ్రీమత్తిరుపతివెంకట
నామకవీశ్వరుల నెన్న నలువకుఁదరమా.
పాములఱేనికిఁ దరమా;
కామారికిఁదరమ తమ్మికంటికిఁదరమా!

చ॥ సుకులమునందుఁబుట్టి కడుసొంపగువిద్యలఁ జేతఁబట్టియా
కుకవుల మొట్టి తద్బిరుదకోటులనూడఁగఁ గొట్టి సత్ప్రభు
ప్రకరములిచ్చినట్టి బహురత్నవిభూషలు మేనఁబెట్టిన
ట్టికవులసామ్యమందఁగలఁడే యొకఁడేనిజగత్త్రయమ్మునన్॥

శా॥ మీధీరత్వము మీగుణాతిశయమున్ మీపాండితీప్రౌఢియున్
మీధార్ష్ట్యంబును మీప్రబంధరచనల్ మీవాగ్ఝరీమాధురుల్
మీధీచాతురి మీగభీరమహిమల్ మీధారణాశక్తియే
రీధాత్రిస్థలిఁ జెందువారుగలరే యెన్నోపుటాల్ వేసినన్॥

సీ॥ సకలవిద్యలచేత సరిబూనఁగావచ్చి
పన్నగాధిపుఁడఘః పతితుఁడయ్యె
కవితాచమత్కృతి ఘనతఁబూనఁదొడంగి
మునియయివాల్మీకి పుట్టినోదిగె
వితరణగుణమున జతగొనదఁలఁచివే
ల్పులగడ్డివేవేగపూరిగఱచె
కీర్తిఁ‌శోనె కృసక్కేములాడిచఁ(దుండు
బహుళ పక్షక్షీణ భావమొందె॥

తే॥ గీ॥ బళిరసమధికగుణగణ ప్రాభవముల
నరయదిరుపతి వేంకటేశ్వరులకీడు
వఱలుతిరుపతి వేంకటేశ్వరులెభువిని
బరులుకారనియనవచ్చు బాతముగను॥

చం॥ తిరుపతివేంకటేశ్వరులు దివ్యభుజంగకసంగుసాటసే
తిరుపతివేం కటేశకవిధీరుల దీటుకురాకలజ్జభూ
ధరముసకేగి యచ్చటను దా గతచేష్టతనొందియుండిరీ
ధరనభిమానులౌ జనులుదామునను నోడినడాఁగియుండరే॥

ఇట్లుబుధ విధేయుఁడు

శ్రీ బెల్లంకొండ రామకవీంద్ర శిష్యుఁడు లంకా సుందరరామశాస్త్రి,
గురిజాలతాలూకా అంబాపురం.

శ్రీకొప్పరపుంగవులు ప్రచురించిన పత్రికలుచూచి సోమవారమునాడు సభయగునని పెక్కుగ్రామములనుండి వచ్చినవేలకొలది రసికులందఱు "మేముమీదర్శనముకే వచ్చితిమి మమ్ముృవృధాశులఁ జేయుదగదు" అనికోరగాఁ దిరుపతివెంకటేశ్వరులు నాడు మధ్యాహ్నము 3 గంటలు మొదలు 7 గంటలవరకు సభచేసి తమ కవితామృతధారచే సభ్యులనందఱి నోలలాడించిరి సభానంతరము సభాధ్యక్షులగు శ్రీజానపాటి పట్టాభిరామశాస్త్రి గారుపన్యసించిరి శ్రీ బెల్లంకొండ రామారావుగారిశిష్యులగు వెంకటప్పయ్య సుందరరామశాస్త్రుల వారాసభలోఁ బైపద్యములఁ జదివిరి.

# పీఠిక.

---

శ్రీమత్సరదేవతాయైనమః

ఆర్యులారా!

ఈయూర భాషాభిమానులగు బ్రహ్మశ్రీ రంగావఝ్ఝుల హనుమయ్య గారును, గొల్లపూడి రామనాథయ్యగారును, మ॥ రా॥ శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగారును మొదలగు పెద్దలు గౌరవపురస్సరము గా నాహ్వానము సేయుటచే శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి బాలసరస్వతీత్యాది బిరుదాంకితులగు శ్రీ తిరుపతివేంక టేశ్వర కవీశ్వరులు 18 వ తేది సాయంతనము 4 గంటల రైలుమీఁద నిక్కడకువిచ్చేసిరి. పౌరులు నందువిశేషించి స్కూళ్లలోఁ జదువువిద్యా ర్థులందఱు ముందుగా గుంపులుగుంపులుగా రైలుస్టేషనుకుఁబోయి తమయానందమును వెల్లడించుచు వారినియూరం బ్రవేశపెట్టిరి. 19 వ తేది పగలు 2 గంటలకు హిందూనాటక సమాజమువారి నాటకశాలయం దు సభసమకూర్పఁబడెను. గుంటూరియందలి పౌరులేకాక చుట్టుపట్లను న్న పల్లెలవారును నవధానసభాదర్శన కుతూహలులై వచ్చుటచే నిసు ముజల్లినను రాలకుండునట్లు నాటకభవనమంతయు నసంఖ్యాకములగు జనములచే నిండి నిబిడీకృతంబై యుండె. 2½ గంటలకు నవధానము ప్రా రంభింపఁబడెను. ఒకరిరువురేమి తక్కువయో కాని పృచ్ఛకులునూర్గురు గూరుచుండిరి, వారును నూర్గురికి చెప్పుటకు సంసిద్ధులైయుండిరి, కాని నవధానులొక్కొక్కరికొక్క పాదముచొప్పున నలుబదిమందికిఁ బద్యములు చెప్పునప్పటికి, మ॥ రా॥ రా॥ ఏకా రామయ్యపంతులు గారును, కొండా వెంకటప్పయ్య పంతులుగారును, బ్రహ్మశ్రీ రంగావ ఝ్ఝులహనుమయ్యగారును మొదలగు పెద్దలు "నలువదిమందిచాలరా, పలయాయాసము, గాలముచాలపట్టు" ననివక్కాణించుటచే, నాఁడు 7 గంటలగువరకు నప్పుడప్పుడడిగినవెల్ల తామిదివరకు నాయారాజులపై రచించిన పద్యముల సభ్యగర్ణపేయముగాఁ జదువుచు నలువదిమందిలో

నిరువదిమందికిఁ బూర్తిగా నాలుగు చరణములు చెప్పి చదివి వేసి మిగిలిన యిరువదిమందికి రెండురెండు చరణంబుల చొప్పునఁ జెప్పివేసిరి. మరల మఱునాఁడు సభ 3 గంటలకు సమకూర్పఁబడెను. కాని కొన్ని యనివార్యములగు నంతరాయములచే సభ మానుకోవలసి నంత దుర్యోగము జరిగినను, గుంటూరివాస్తవ్యుల సుకృతముచేతనో, సిద్ధసంకల్పులైన తిరుపతివెంకటేశ్వరుల మహిమచేతనో సభ జయప్రద ముగా జరిగెను బ్రహ్మశ్రీ వెంకటశాస్త్రి గారప్పటికి జ్వరపీడితులై యున్నను, వారు తమయుద్యమమును నెఱవేర్చిసభ్యులకు గలుగఁజేసిన బ్రహ్మానంద మనితరసాధ్యమని వక్కాణించుట తక్క విశేషించి వర్ణిం చుట నాబోంట్లకు శక్యముగాదు. ఇంక నారోగ్యస్థితిలో వారొనరించున వధానమెంత యానందకరమైయుండునో యెవరుచెప్పఁగలరు. నాఁటిరో జున మిగిలిన యిరువదిమందికి మిగిలిన రెండు పాదములు చెప్పిమరలఁ జదువుటకుఁ గొంచెము కాలమే పట్టినను, రాత్రి 8 గంటలవరకు వారి యసమానకవితాసుధారసధారలచే సభయంతయు నిస్తరంగంబైన సముద్రమువలెనుండెను. పిదపజయజయేతిధ్వానములతో సభ ముగిం పఁబడెను. నాఁటిరాత్రి హిందూనాటకసమాజమువారి పాండవవిజయ ప్రదర్శనమున కంతరాయముకలుగుననికాని లేనిచో సభ యెప్పటికిముగి సియుండునో తెలియదు. అవధానాంతమున నాయూరపండితులుతమయా నందమును వెల్లడించుచు చంపకోత్పలాది మాలికలచే నవధానుల నలం కరించిరి. ఏతదవధాన పద్యంబులు లేఖకప్రమాదంబుల సవరించి మా తృకానుసారంబుగ ముద్రించితిని. చివురున వారువారుచదివిన పద్యము లుసహింతముఁగూర్చితి. భాషాభిమానులకందఱికీపొత్తము హస్తభూష ణంబై యుండుఁగాక.

ఇట్లు,

గుంటూరు,<br>29—8—11

బలిజేపల్లి లక్ష్మీకాంతకవి,<br>ప్రొప్రైటరు, చంద్రికా ముద్రాక్షరశాల.

—:O:—

కం॥ శుభలగ్నంబునవిప్రులు । సభికులునాశీర్వదింపఁ జతురాననుఁ స
న్నిభుఁడగుబాలుఁడు రత్న । ప్రభనిడుదెడితాళిఁగట్టెఁ బడతిగళమునన్, 94

ఆ॥ పసినిపళ్లెరములఁ బరఁగనింపినయాఁడి । ముత్తియముల దోయిలెత్తి యొకరి
కొకరుపోసికొనిరి ప్రకటించితలఁబ్రాలు । బాలికామణియును బాలకుండు. 85

వ॥ ఆసమయంబున

కం॥ క్షీరాబ్ధితనయ గౌరీ । వారిజముఖి వాణి శక్రవనితయును మరు
న్నారీమణులు వశిష్ఠున్ । జేరంజనుదెంచి రిట్టిచిఱుతలఁజూడన్. 87

వ॥ ఇట్లక్షతారోపణానంతరంబున బ్రహ్మగ్రంథియుక్తంబుగావధూవరులనరుంధతీ దర్శ
నంబు సేయించునవసరంబునఁ దత్సమీపంబుననున్న వాగ్దేవింజూచి పర్వతరాజపు
త్రి యిట్లనియె. 88

కం॥ “శారద! నీవల్లభుఁ డీ । వారిజదళనయన మర్త్యవాసము సేయన్
గావమునరచియించెను । కోరనేమంచాల యిట్టిపాటము సేయన్. 89

కం॥ ఈలోకమునను వీరికిఁ । బోలు నెనుఖియుంపఁ బుడమిఁబుట్టినజనముల్
చాలుదురేవర్ణింపఁగ? బాలుని బాలికను బొగడ భువనకుఁదక్కన్. 90

కం॥ నాబాలునియందంబున । నీబాలుఁడుజననమందె నిక్కంబిది యా
నీబాలికనాకోడలు । గాఁబోలదె? యిట్టిచెలువుగలదె? జగములన్. 91

కం॥ ఈలీల మర్త్యమున మం । చాలను బాలునకు సురత మలవడఁజేయన్
బోలదునాలోకంబున । హేలాగతిఁగూడియుండ నింపగునాకున్” 92

కం॥ అనిబాలుని మంచాలన్ । గనుగొని నగజాత గాఢకౌతుకమున దీ
వనలిచ్చె నిఖిలశత్రుల । ననిగెల్వఁగ దేవసుదతు“లౌనా”నఁగన్. 93

కం॥ దీవించి నగజ నానా । దేవనితంబినులుగొల్వ దివినుండి మహా
దేవాద్రికేగె నిచ్చట । వైవాహికమందిరమున వైభవమెసఁగన్. 94

కం॥ బాలుని గన్నమవసుధా । పాలుఁడుపూజించి చిత్రపటమణిభూషా
జాలంబు లరణమిడి వి । ప్రాలింబూజింప నాయు నర్థించెదగన్. 95

కం॥ “భావుక! నాయెడఁ గరుణా । భావంబున విప్రజనులఁ బరితృప్తిగ సం
భావింపఁగలయు నిద్ధా । ద్భావంబులు దెలియ నాకు శక్తత గలదే?” 96

కం॥ అనినం బ్రహ్మనాయఁడు । విని మోమున దరహసనము! వెలయఁగ నాకీ
పని గల్పించిన విప్రులు । వినిరో యిది? నన్నుఁ జూచి విమతు రయా పక? 97

ఆ॥ నన్నుఁ జూపికుండ మన్నించి వారలఁ । బనుపు నీకొలంది భక్తి సేసి
బ్రహ్మనాయఁడన్న భ్రాంతి దీఱదు వారి కెంతయైన యానసంత మేదొ. 98

వ॥ అనినం గన్నమనాయం డిట్లనియె 99

కం॥ “ఒక్కొక విప్రుని దోయిట నెక్కొన శ్రీరామమాడ లిరువది గాని
లెక్కకు వచ్చిన వారలఁ । జిక్కఁగ నుండంగ నియ్య సిరిదక్కవయే?” 100

సీ॥ అనిన బ్రహ్మనాయఁ డాదరంబున లేచి సంహాసనము చెంతఁ జేయివీచి
పగసశోభనసభాస్థానంబుఁ జొత్తెంచి దొడ్డవిప్రుల నెల్ల దొడ్డిఁ బెట్టి
మండలాధీశసామంతరాజన్యు లాసీనులై తద్ద్వారసీమనుండఁ
గనకంపునిష్కము ల్గంపలఁ దెప్పించి పోసి గాఁబోయించి మూఁకఁ జూచి
యొక్కరొక్కరికి నిర్వది లెక్క నిట్లు । పంచి యిచ్చినఁ ద్దనసంచయంబు
నుంకువపదార్థమును నింటనున్న విత్త । సమితిగడచనె నిరవశేషంబు గాఁగ.

వ॥ ఆసమయంబున. 102

ఉ॥ “ఎచ్చటనుండి వచ్చిరో మహీసురముఖ్యులు కొత్తలైన వా
రిచ్చపలాక్షి పెండ్లికి నిచ్చటివారలు గారు చూడఁగా
మచ్చిక బ్రహ్మనాయని యమానుషచర్య”లటంచు భ్రాంతులై
మెచ్చఁగఁ బౌరసంఘములు మేలని కన్నమనీఁడు నమ్రుఁడై. 103

ఆ॥ “దేవ! నీమహానుభావంబు దెలియనే, నెంతవాఁడ నీ నితాంతకరుణ
వెలయ నన్ను మనుపఁ దలఁచి నీభటులలో, నొకనిఁ గాఁగఁ జూడు ముచితభంగి”

కం॥ అని వినుతించిన నాయం, డనుకంపఁ దలిర్పఁ గన్నమావని పాలున్
ఘనభాగ్యనిధిని గా, మన్నన చేసె మహాద్భుతంబున జను లెన్నన్. 105

సీ॥ కన్నమనాయండు కలబంధుజనముల భటులసామంతభూపాలకులను
వరుస బ్రహ్మక్షత్రవైశ్యశూద్రాంత్యజప్రభృతిజనంబుల భక్ష్యభోజ్య

లేహ్యపానీయప్రభక్ష్యభోజనములఁ దృప్తులఁ గావించి దివ్యగంధ
కర్పూరవీటికలర్పించి చిత్రంపుఁబట్టాంబరంబులు గట్టనిచ్చి
నిత్యనూతనవిభవవినీతి మెఱయ, వన్నెమీఱ వివాహోత్సవంబొనర్చె
నూరనాబాలవృద్ధులుగోరినట్లు, సతివివాహంబు సేయు పర్వతునిభంగి 106

కం॥ మంచాల బాలునకును స, మంచితగతిఁ బెండ్లిచేసి మహిమోన్నతిచే
మించిన నాయనివిభవం, బెంచి మహీసురులు మిగుల హెచ్చిరి సిరులన్. 107

ఆ॥ నాయఁడేలుభూమి నానాటికైశ్వర్య, శోభితత్వమొందె శుక్లపక్ష
చంద్రికావిధమునఁ జప్పింప జనదకో, శాళితృప్తినొంద నంతనచట 108

కం॥ పాయక గురిజాలపురిన్, నాయఁడురా లొక్కనాఁడు "నాయనిరాజ్యం
బేయనుపురదరియొప్పెనొ, భోయులనంబంచి మూఁడుబోలు"నటంచున్ 109

కం॥ ఏగులయొల్లండనునొక, నాగరికుంబిలిచి "నీవు నాయనిపురిలో
భోగైశ్వర్యములారసి, యేగరిపైరమ్మ" నాయఁ డెఱుఁగకయుండన్. 110

సీ॥ అని చెప్పి పంచిన నాభోజుండిలుఁ జేరి ప్రచ్ఛన్నవేషసంపత్తి మెఱయ
రమణమృదూర్ధ్వపుండ్రద్వాదశముఁ బెట్టి పట్టాంబరం బడ్డకట్టుగట్టి
పద్మాక్షమాలికాపటలంబు మెడఁబెట్టి డాకేలఁ దాలవృంతము ధరించి
పరిధితతామ్రికయపాత్రి మూఁదలఁ దాల్చి వలచేతఁ జిఱుతబ్రిద్దలునమర్చి
"హరిరో హరి" యనివీథులఁ బరువులిడుచు, అంకుసేయుచు "శ్రీరంగరంగ" యనుచుఁ
బరమసాత్త్వికవైష్ణవభావమొప్పఁ, దిరిపెమెత్తెను మాచెర్లపురవరమున. 111

కం॥ ఇల్లిల్లు దప్పకుండఁగఁ, గొల్లలునుచు బికిరిమెత్తె. గిసలయపాలుల్
"తెల్లం బీతఁడు లక్ష్మీ, వల్లభదాసుం"డటంచు వాత్సల్యమునన్. 112

సీ॥ కమలాక్షి యొకతె ముత్యములు భిక్షము వెట్టెఁ బద్మరాగము లొక్కపడఁతియొసఁగె
మగువయొక్కతె విద్రుమములు దోసటఁ బెట్టె నీలంబులిడె నొక్కనీలవేణి
పుష్యరాగములు సొంపుగఁ బెట్టెనొకబోటి వజ్రంబు లొకకీరవాణియొసఁగె
వైడూర్యమణు లొక్కవనితసమర్పించె మాడలెన్నియొ వెట్టెఁ జేడెయొకతె
యొకతెగారుత్మతములు వేఱొకతెవాంఛ, తార్ధములు పెట్టె నన్నగరాంతసీమఁ
గలయఁదిరుగుచు దైవయోగమున దారి, దప్పిశీలాంబికా నిశాంతంబుఁ జొచ్చె.

కం॥ చొచ్చినశీలాంబిక గను, విచ్చివిలోకించి "యోవివేకవిహీనా!
విచ్చేసితేల? యిటనీ, గచ్చులవేషములు మానగావలయుఁజామీ 114

కం॥ కల్లాడ నేల? యేగుల, యెల్లండవునీవు నిన్ను నెఱుఁగుదు నాయం
దుల్లమునఁ దెలియకుండఁగ, నల్లనఁజను మిల్లుఁజేరు మంతియెచాలున్" 115

మ॥ అనిశీలాంబిక బుద్ధిఁజెప్పనిని మాయావేషి యోలంబునన్
జననట్లొంటిని బ్రహ్మనాయఁడు యథేచ్ఛావర్తియైచూచి గ్ర
క్కునఁజేపిచి "యిదేమివేష? మిటునీకున్ రాఁగతంబేమిరా?
వినుము న్నేగులయెల్లఁడుం దెలుఁగనా? నిక్కంబుగాఁ జెప్పరా. 116

తే॥ అధిపతికిమేలె? కుశలంబెయనుజులకును? బ్రజలకుశుభంబె? భద్రమే భటజనులకు?
విప్రవరులెల్లఁబూజ్యులే? విభునియొద్ద, నున్ననాయకురాల సుఖంబున్నయదియె?"

కం॥ అనినను నేగులయెల్లం, డను "నో మహాత్మ! వీటనందఱు సుఖులై
పనిసేయుదు రవ్విభునకుఁ, జనుదెంచితినిటుప భుక్తిసాధనకొఱకై 118

తే॥ పోయివచ్చెగ నవిన నా నాయఁడనియె, నాపబండలగుంపులనడిమితోవ
జారిపడితుండఁబొమ్ము మీవారునిన్ను, వెదకివేసారకటుము న్నె వేగిరంబ" 119

కం॥ అనియొల్లసమాడిన నా యుని వాక్యము మనములోననుంచుక మార్గం
బున దైర్యస్ఫురణంబునఁ, జనఁజన నొకనాపబండ జారినఁ బడియెన్. 120

సీ॥ పడియున్న వానితేమ్మఁడు "తన్నరాఁడయ్యో" నని శీఘ్రగామియై యరుగుదెంచి
చూచితత్కార్యంబు సొబగెల్ల విని యగ్రజుని బంచె బ్రహ్మనాయునకు మ్రొక్కఁ
బంచిననతఁడేగి పరమహర్షంబున నమ్మహాత్మునకు జోహారుచేసి
"యనఘ! మీయాజ్ఞ జేకొనక యజ్ఞుండనై పురిఁజేరవేడ్కఁ బొంపిరిగొనంగ
నాపతాలతోవ నేపొరఁజనువేళ, గాలుజారిపడితి గడచిపోవఁ
ద్రోవచూప్పగాన నీవిథిదిశిదప్పి, వచ్చినాఁడ శరణుఁజొచ్చినాఁడ" 121

చం॥ అనవుడుమందహాసమున నమ్మహిమాఢ్యుఁడు వానితోడ ని
ట్లను జతనంబునంజన భయంబొకయించుక యేనిగల్ల దొ

ద్యానఁ జనుమన్న నాభటుఁడు హర్షముతోడ నమస్కరించి స
జ్జనుఁడునువోలె వేగ ననుజన్మునిఁగూడుక సత్వరంబునన్. 122

వ॥ ఇట్లుచని గురిజాలపురవరంబున నలసింగరాజమందిరంబుననున్న నాయకురాలిం గ
నుంగొని యిట్లనియె. 123

ఆ॥ "అమ్మ! యేమి చెప్ప నామహైశ్వర్యంబు । నజునకైనఁ బొగడ నలవికాదు
బ్రహ్మనాయకుఁడున్న పట్టణంబున కేగి । చూచినాఁడ నచటిసొబగులెల్ల. 124

సీ॥ హరినీలఖచితసింహద్వారపంక్తులు వైడూర్యరచితకవాటములును
పద్మరాగోజ్జ్వలప్రాసాదవీథులు చారుగోమేధికస్తంభసమితి
వజ్రనిర్మితసౌధవాతాయనంబులు స్ఫాటికపీఠుల సోపానములును
మరకతశాతకుంభప్రసవేదికలును స్థూలముక్తాఫలతోరణములు
చిత్రపట్టాంబరవితానఖేచరములు । విమలమాణిక్యదీపికాసముదయములు
భవ్యశశికాంతమణిసాలభంజికలును । కృతనియత్కర్షణోత్తానకేతనములు. 125

కం॥ ఆపురమట్టులుండఁగ । బాపునఁగోట్టాలమిట్టపరిఁ గన్నపునీఁ
జేపునని ర్మించిన సౌ । ధోపరివర్ణనలు సేయ నోపుదురె సుకవుల? 126

ఆ॥ బికిరమెత్తికట్టెఁ బ్రభుహేమసౌధంబు । దానిఁజెప్పనేల? తల్లి! వినుము
మనపురంబె కాదు మనుజవల్లభుఁ డేలు । రాజ్యమైన సాటిరాదు సుమ్మి 127

ఉ॥ "ఈమహితార్థసంపదల కెన్నఁడపాయముగల్గ దింక సు
త్రాముసమానుఁడైన మనబ్రహ్మమహీశుఁడు గల్గియుండ నం
చేమటి పౌరసంఘము లపేతభయంబున నిద్రవోదు రి
చ్ఛామతిఁ జోరులంబనిచి సర్వముఁ గైకొనవచ్చు భామినీ!" 128

వ॥ అని చెప్పిన విని నాయకురాలు మాత్సర్యంబున 129

సీ॥ "నల్లమలంగల నాల్గువేలోయల నెఱ్ఱమలంగలయేడువేల
శబరులఁ జెంచుల శౌర్యధురీణుల యవనపుళింద వనాటవరుల
బల్లిదులను బెక్కుబరికాండ్రఁ జెరవాటుదొంగల నెల్లఁ జేరంగఁబిలిచి
జాత్యుచితాహారసముచితాన్నంబులు వెట్టించి వారలపేరువాఁడి

వీటికాశాటికలో నంగి" వినుఁడు శూరు । లార! మాచెర్లపురిఁ జొచ్చి చూఁడగాఁగ
దోఁచితెచ్చితిరేని మీదోఁపుమీకొ । సంగి జీవితములు మీకు సల్పుదాన. 130

కం॥ బాపట గామికిత్తతి । గోసంగులమూఁడువేల గొఁదిగనిత్తున్
మీసాహసంబుఁ జూచెద । గా చయ్యనఁబోయిరండు ఘనఖలమొప్పన్" 131

వ॥ అని చెప్పిపంచిన.

శా॥ కుంతంబుల్ కరవాలముద్గరధనుఃక్షుర్యంకుశోద్యద్గదా
నంతాస్త్రింబులుపూని కొండసిగలొయ్యం బెట్టి ధైర్యంబునన్
బంతంబుల్ పచరింపుచున్ వెడలి దర్పస్ఫూర్తిఁ దత్పట్టణ
ప్రాంతక్ష్మాస్థలిఁ జంద్రభాగతటినీపర్యంత దేశంబునన్. 133

ఆ॥ బరిగిబరిగితిరుగ బ్రహ్మనాయుఁడు తన్న । దీప్రవాహ పలిలతీరమున ను
బ్రహ్మనిష్ఠదీర్చి పజ్జ నల్కుఁడు విని । చేతి సంజ్ఞ భటునిఁ జేరఁబిలిచి 134

ఉ॥ "కన్నమ! చోరసైన్యమిదె గానఁగనయ్యెను జంద్రభాగ కా
సన్నధరాస్థలంబున ససహ్యాత నాయకరాలు పంపఁగా
నున్నతి నేగుదెంచిరి మహోత్కటవిక్రమమొప్ప వీరి ను
త్పన్నబలంబునం గుణనిబద్ధులఁ జేసి కలంచి క్రమ్మఱన్. 135

ఆ॥ చంద్రవంకలోని సన్నపుసికతంబు, గోనియలనునించి కొలుచునోలె
బందిజనుల నెల్లఁ బశువులఁగా వారి, పురముఁ జేరఁబంపు బరువులెత్తి" 136

కం॥ అని చెప్పిపంపఁ గన్నమ, జనితక్రోధమున బిమునుచాడ్పునఁ జని త
ద్ఘనసంతాద్యాయుధములఁ. దనకాంక్షయమునన ఱకెఁ దఱుముచువరుసన్॥ 137

ఆ॥ కొఱవిద్రిప్పినటులఁ గొనకొని ప్రజమట్టు, తిరిగితిరిగి పాఱియరుగనీక
మొనసియాయుధములు మోపులుగట్టించి, తలలనెత్తి కొంగజికి బలిమి। 138

కం॥ అలువగుసికతపుగోనియ, తెలమింగొందఱకు మూఁపులెక్కించి "చనుం
డలగురిజాలం జేరఁగ, వలయుం దెలవారు"నను చు వడినడిపించెన్॥ 139

కం॥ మును లాడెడూది కొంపజే, కిని ముడియలుగట్టి తలలఁగీలించి బి
డారనుసందేహం బెదురగు, జనములకునుదోఁప బందిజనములఁ దోలెన్॥ 140

ఉ॥ కన్నమదాసుఁడీగతి జనున్యుల దీనులఁజేసి తత్పురా
సన్నధరాస్థలంబున విశాలదృఢావరణంబు గోష్ఠమై
యున్న సమున్నతప్రతిభటౌఘనిపీడకయున్నయందఱన్
గ్రన్నన దొడ్డిపెట్టి పసిఁగాచినయట్టులనుండ నాకిటన్ 141

కం॥ అంతటఁ బౌరజనంబులు, కొంతల కంతలను నిలిచి కనుగొని యీవృ
త్తాంతము నాయకురాలికి, మంతనమునఁ జెప్పి రొకట మాత్సర్యమునన్ 142

వ॥ అప్పుడు. 143

కం॥ అక్కపటాంగనవాలము, ద్రొక్కఁబడుభుజంగిపోలె రోజుచు నరుణం
బెక్కినకన్నుల నాలుగు, దిక్కులుఁ జూచుచును దొడ్డిదెస కరుగంగన్ 144

సీ॥ దొడ్డివాకిటఁ గేల దొడ్డకైదువుఁబూని శమనుని కైవడి నమరువానిఁ
గల్పాంతకాలాభ్రగర్జనంబులఁబోలు కఠినభాషల వారిఁ గలఁచువాని
ఖాదిరాంగారప్రకాశారుణంబులై తనరు కర్ణాంతనేత్రములవాని
మత్తదంతావళోన్మత్తయానంబుల జఙ్ఘురవిహారంబు సలుపువాని
నొప్పు నాజానుదీర్ఘబాహువులవానిఁ, గవర నాయుని మది మధ్యఁ దలఁచువానిఁ
జరమహానీలశైలసుందరశరీర, యష్టిగలవాని నాయకురాలు చూచె 145

కం॥ చూచి తలయూఁచి బొరలు, చాచి పసంబులను నేలఁజఱచుచు "మాలం
డీచక్కి నిలువఁగూడునె? నీచుఁడ! భయమింతలేక నిలిచెదవిచటన్"॥ 146

కం॥ అనికోపించినకన్నమ, జనితామర్షమున వాలు సారింపుచు ది
గ్గన గరుడుండహికన్యకు, వెనుదగిలినరీతిఁ దఱిమి విక్రమఖనియై॥ 147

సీ॥ "మాలండనుచు బుద్ధిమాలి పల్కిననీదు నాలుక రెండుగా నఱకువాఁడఁ
గడజాతియనినన్నుఁ గడవబల్కిన నీ రదంబులు రాల్చు శౌర్యంబువాఁడ
ముట్టరాదని నన్నుఁ దిట్టిన నీ స్తనద్వయము ఖండలుగాఁగఁ దఱుగువాఁడఁ
బంచముండనినన్ను నెంచిన నీ క్రూరపంచశాఖలను ఖండించువాఁడ
"నాయకు నాజ్ఞలేక నాతినిజంపంగ విహితమగునె?" యనుచు విడిచినాఁడ
నెందుఁబోయెదింక నిందీవరాక్షి! నీ, కైశ్యమైనఁ గోసికాని విడువ" 148

వ॥ అనిఘుంకించి నిజభుజాదండమండితాఖండమండలాగ్రంబొఱవెఱికి హరిణ రూపంబుఁదాల్చి చతుర్ముఖమూర్తిం దఱుము మృగవ్యాధరుద్రుండునుం బోలెఁ దఱిమి కాంతాహననంబు శూరులకధర్మంబని మఱలివచ్చి గోష్ఠద్వారంబుననిలిచె నన్నాయకు రాలు శార్దూలవక్త్రంబు వెలువడిపాఱి యారంబుదూఱు సారంగియుంబోలె రాజ మందిరంబుఁజొచ్చె నంత, 149

కం॥ పాయక మాచెర్లపురిక । నాయుఁడు నిత్యవిభుఁ దిర్చి "నాకన్నమరాఁ
డాయె నటంబోవనేమియు । పాయము సంధిల్లెనో మహాక్రూరుల చేత" 150

వ॥ అని యోజించి,

సీ॥ కనకమంజులవజ్రకవచంబుధరియించి లలితముక్తాదామములు వహించి
నవరత్నమకరకుండలములు హత్తించి డాల్మించు మణికిరీటంబు పెట్టి
తపనీయహీరాంగదములు బాహులఁబూని కాంచనరచిత మేఖలవహించి
చారుగాంగేయరుక్కారురాజము పెట్టి రాజితపట్టాంబరంబుఁగట్టి
కలితగారుత్మతాందోళికంబు నెక్కి । ధవళచామర లిష్టబాంధవులు వీవ
హితులుకొందఱుగురిజాలకేగి తనదు । రాకఁదెలుపంగ నేగ నస్తోకమహిమ. 152

కం॥ అనఘుని యాగమనంబును । విని వెసనలసింగభూమివిభుఁ డెదురుకొనన్
జనుటయు నాయకురాలే । పుడు గుటిలస్వాంతయగుచు భూపతిసభలోన్. 153

కం॥ మనుజనరుఁ డెక్కుసింహా । సనని కటధరాతలంబు శాతఖనిత్రం
బునఁ ద్రవ్వి తక్బిలంబున । సునిశితశస్త్రములు పాతి చొప్పడకుండన్. 154

ఆ॥ పైన జీర్ణకాష్టపంక్తులడ్డము పెట్టి । మాయ దెలియకుండ మట్టుపఱచి
కపటమునవసించెఁ గాంతదానొకచోటఁ । జెలియమాయనతఁడు చిక్కుపడునె?

కం॥ అచ్చట బ్రహ్మనాయుని । జెచ్చెర నాలింగనంబు సేసి మహీశుం
డచ్చుపుఁ గ్రొందండలఁ దన । మెచ్చులరచ్చకును దెచ్చె మించినకరుణన్. 156

వ॥ ఇష్టాస్థానంబుఁజేరవచ్చి భవిష్యదర్థజ్ఞాన సంపన్నుండు గావున బ్రహ్మనాయుండు సామంతామాత్యపురోహితాదులఁ బార్శ్వభాగంబులంజనుదేర నియోగించి, 157

కం॥ అంభోజముఖి యొనర్చిన । దంభాచ్ఛాదనపుదారిఁ దప్పక గమనా
రంభంబుదనర నడిచె న్వా । యంభుప్రతిభుండు కుంభకాభ్యాసమునన్. 158

మ॥ శకునిప్రస్తుతధార్తరాష్ట్రవరదుష్పాండిత్యఘోషంబు ద
ర్పకదుశ్శాసనయుక్తిమైనెసఁగఁ గర్ణక్రూరభావాప్తిచే
నకటా! దుష్టచతుష్టయాధిగత మాయాక్షాకరం బన్న నా
త్మకళంకన్ నవలా కొలంకు వెడలెన్ మత్తేభశుంభద్గతిన్. 26

మ॥ ఒకకెరయోరగఁ దత్తటిన్ నిలిచి నీరొప్పారఁగా జాఱఁ గ్రొ
త్తక మొయ్యొయ్యనఁ జేతులంబిడుచు మం జేపావడన్ షట్పదా
లకనెమ్మో తడియొత్తె దుప్పటపుఁజేలంగట్టి చూపట్టెఁ జాం
ద్రికనీహారపరీతకాంచనలతాధిక్యన్మనోజ్ఞాకృతిన్. 27

మ॥ కొనగోళ్లం దొగకంటి వెంద్రుకలుచిక్కుల్ దీసిసాంబ్రాణివా
సనహత్తించి జవాదిలేఁబదునుమించంజిక్కు దంతంపుదు
వ్వెనచేదువ్వుచుఁ గొప్పుఁదీర్చె నొకతన్వీరత్న మాయత్నముల్
గనిమారుండును గొప్పుఁదీర్చె మెఱుఁగెక్కం జివ్వి కొప్పింటికిన్. 28

ఉ॥ మొల్లలు మట్టి ముత్తెఱఁగు ముత్తెపుసొమ్ములు వెట్టి నెమ్మెయిన్
జల్లనికప్పురంబలఁదిచందనపుందిలకంబుఁగూర్చి రం
జిల్లఁగ నింతులెల్లఁ గయిసేసిరియాసిరి నా శిరీషసం
ఫుల్లసుమాంగి నా సుదృగపూర్వసురంగిఁ నభంగిఁ బ్రేమమై 29

ఆ॥ సిరికినపుడుగూర్చుశృంగారమంతయుఁ । జిత్తజాతతప్తచిత్తగాన
శీతలోపచారరీతిదోఁచియు(తాంత)శీతలోపచారరీతి దోఁచె. 30

మ॥ చెలులుం జిత్రముగా యథోచితగతిన్ శృంగారముంబూని క్రీ
వలనున్నంత సువారపుంబనులచెల్వల్ బోనఁగావళ్లతో
లలితేష్టాన్నపదార్థముల్ గొనుచురా లక్ష్మీశ్మ ఏతింగూడి యా
కలకంఠుల్ వనభోజనంబులచటన్ గావించి రిచ్ఛాగతిన్. 31

కం॥ బలిమినిటువలయుమాత్రను । కలిమిపొలఁతియారగించి కమలోపవనిన్
జెలివనటవిశ్రమించుట । కలమిథునాంచిత లతాగృహమున వసింపన్. 32

మ॥ వలువొందం(దొలుదీవి) ప్రామినుకుమిన్నల్ వ్రూని రశ్మిచ్ఛటల్

మలయం గాలిని వేద్యనూరుకరలీలానీయమానాశుగో
జ్వాలవేగంబున ఘోరపుష్కరవరాభ్యగ్రాహితం బశ్చిమా
చలతీరంబునకుం డిగెం దరణి వేశ్యాస్వాంతముల్ రంజిలన్. 33

తే॥ పద్మయాత్రతి విరహాతాపమునం బొగులం దన్నివాసములగుటం బద్మములు నొగిలెం
దానుబద్మాప్తుండగుటం దత్తన్మహార్తి । నోర్వకరిగినగతి మిత్రుం డుదధిం గ్రుంకె.

మ॥ బలవ ద్దినఖయాగత విపద్దశానే హీతచక్రద్వైన్య వ
గ్గలముగుచో నశల్యధ్వకరకచ్ఛటతో శతధా సహస్రధా
దళనమునొందు డెందములం జల్లడమంగుచు సొమ్మసిల్లునో
జలం దగెం బద్మినుల్ ముఖవివర్ణాల నందముగుందు చంచనముల్ 35

మ॥ నగకోదండధరుండు తాండవ మఖండన్మండలావ్యాప్తిప
ల్వంగం జేతప్ప సముద్ధతిన్ బడినచాళ్వాభక్కనాం గ్రుంకె నా
నగతిన్ భానుండు తద్విశీర్ణ మణిరజ్జుచ్ఛాయనా సంజ నిం
జిగిసెంచెన్ దదనుస్వరంబులన మించెం జక్రదైన్యస్వనుల్ 36

చం॥ రయమున నిల్వం దావులయి రాజిలుతమ్ములు సొమ్మసిల్లుటన్
బయినవలంబనంబగుచు భాసిలుమిత్రకరాళి పట్టులే
మియుంగని యెకాలమున మెట్టినకొమ్మయుం బట్టియున్నకొ
మ్మయు విఱుంగం దిగబ్బడినమాడ్కిం గ కావికలయ్యెం జక్రముల్ 37

సీ॥ తపనుడప్పవసేయం దద్వ్యనుగ్రహణార్థ మటుదోంచు చటులార్భటార్చియనంగ
వరుణుండు విష్ణుండై యరుగుతోడనంజను పతిగ శేఖరు గరుత్త్వతతియనంగ
లోకబంధునకు రత్నాకరుం డేమరేగి బడిసవైచిన మణిప్రరుచియనంగ
నినుని రాగసహ దిగంగన పొంగ వెలిం జిమ్ము తదనురాగరసాంబు ధారయనంగఁ
(దగుణతారాతిక న్యాయ)నుసరణకరణ । సమయకాముక సముచితత్రమువిరచిత
జవమనఃప్రితసపదిసాక్షాత్కృతారు । ణావయవదివ్యశక్తినావలరెసంధ్య 38

చం॥ కనదినమండలంపుం బెరంగాలపులిందుడు మ్రగుంకు మెట్టితో
పెనుచటినుర్గదొర్బ్బనట బెట్టుగం జెందిన తేనెచాలునాం
దనరెడుసంజ పైబరంగుతన్మధుమక్షికలట్లు పైకొనెన్

మునిముని యిర్లువాని మొనముక్కలుసోఁకఁజలించెఁ జక్రముల్. 39

తే॥ భానుబింబంబుపోలు పెందుఁగానకునికి । జనులఁ దమతండ్రి యొచటికిఁ జనియె నను చు
నడుగుటకు జాడఁబడివచ్చు యమున యనఁగఁ । గలయఁబర్వెను జీఁకటికప్పు దిశల. 40

ఉ॥ మారుని మాయపంపు దినమానము మేల్ నడఁగింపు జారిణీ
జారులకుస్తరింపు జలజంబులకుందలవంపు కోకసం
సారము పట్టగింపు నెలబాలుని రాకకు మోమునోంపు శృం
గారరసంబు ముంపు కనఁగాఁదగె జీఁకటిగుంపు పెంపుగాన్. 41

ఉ॥ అంచితరాగవీధి పసుపచ్చల వెన్క యెఁడు బచ్చుగుత్తిగా
వించి దిగంతసీమలకు వేమఱుఁ బంపఁగఁ దంకసాలవే
యించిన వెండికాసులపు డెన్నిక దాఁచుకట్టకై వెసం బచా
రించినరీతిఁ దోఁచె వివరింపఁగ నత్తఱిఁ దారకావళుల్. 42

కం॥ పాటల మాటల నచ్చెరు । పాటలు శచిగూర్పఁ బొగడుపని కెత్తిన ప్రా
క్పాటలగంధి కరంబనఁ । బాటలపటుకాంతి యంతఁ బ్రాచిం దోఁచెన్. 43

చం॥ ఇలఁ దన చేతిరత్నమిపు డెవ్వరొ దొంగిలిరంచుఁ గాలమన్
తలపరిపట్టి పల్కులకు దార్చుచు వెన్కన నద్భనర్తకుం
డలవడఁ గేడిగట్టుటకునై యతఁడెత్తినవత్తి కెంపుజాఁ
బలుకయనం జనించె శశి ప్రాగ్దిశ నూహితలోహితద్యుతిన్. 44

తే॥ సరసుఁడీశానుఁడొనరించు సాంధ్యనటన । మరుదుగా మెచ్చి పేర్మి నదితుఁదొసంగు
సుధరమదభేదియెత్తిన క్రొమ్మొఱుంగు । పసిఁడియుండెన నిందుబింబంబు దోఁచె. 45

మ॥ సమదోద్రేకతఁ గొమ్ము క్రుద్దుకొనుచుం జౌదంతిపై లేచి మ్రాను
త్క్రమవేగంబున నూడి యుర్వి బడు తత్పంతోగ్రమాశిక్యమం
జిమలీలావలయంబనంగ నుదయించెం జంద్రుఁడున్నవ్యక్తరా
గముతో మధ్యబిలంబుపోల్కిఁ నపుడంకశ్రీ పసంపం దగన్. 46

మ॥ కళలం గాలవు బభ్రురాజిన సురేఖల్ నీటువెట్టంగ మం
జులకాంతిం దగు కేసరంపు నును మచ్చల్ తేఁటిమైనంపుటుం

డలు తత్పక్షరుచిచ్ఛటామలినవర్ణత్కృష్ణికాశాణముల్
గలచెంగల్వలకట్టె చంచులవలీలన్ విచ్చెఁ దత్సన్నిధిన్ 47

మ॥ సుముఖుండై శశి చూడ జూడ నరుణాంశుల్ వీడి శుభ్రప్రభల్
సముదారస్థితినిండఁ గాండఘుటచంచచ్చంద్రికాత్రపూ
రమునం దేలెడు వెన్నముద్దకరణిన్ రాణించెఁ దారాసమూ
హములాకీర్ణతదీయబిందుసముదాయశ్రీలఁ జెల్వొందఁ గాన్ 48

చం॥ సమయపుదండుగీడు వినుజాడను జీఁకటిపేరికామినిన్
దమిదపింయించి చక్రిజనతాభయదోద్ధతిజాజువాఱ న
శ్రమగతిఁగొన్నముత్తియపుజాజరబుట్టియనంగఁ జంద్రుఁ డం
దముఁగనెఁ దద్వికీర్ణభసితంబన నిండెవిపాండుచంద్రికల్. 40

మ॥ సిరిమించన్ నెలవెండిజాతున కవిచ్ఛిన్నంబులై డిగ్గి త
త్కరజాలంబను (సోస్త్రి) యుత్పలరసైకస్వాదుసద్యోఘృతో
త్కరధారం బొదలింపుమం బయిసముద్యత్తద్రజశ్శక్కరల్
దొరుగంజేసె చకోరపాలికులు విందుల్ వెట్టి రొండొర్లకున్ 50

చం॥ నిగుడశశాంకశాతకరనిష్ఠురపాతకుఁగాక కాకని
క్కఁగఁ గ వజక్కవల్ నికటకంజనికుంజముఖంబుదూఱఁగా
మొగములదైన్యముల్ దోలక మోయుచుబోవఁగసాఁగె రాజుగో
ట్టఁగ మొగసాలకున్ మొఱయిడంజనువీఁకను శోకమందుచున్. 51

కం॥ ఆకొన్నసురలు చంద్రుని । నీకళలందఱికిసరివి నీవిడకున్నన్
బైకొందవచ్చు నీకని । చేకొనితరివాడిచినట్లు చిహ్నంబమరెన్ 52

తే॥ కమలగర్భుండు సృజియించుకాలమున నె । కలనితనియందు షోడశకళలటంచు
నాసవాదులుదెలియవిలాసమిడిన । పోంకమునఁ బంకజారిపై నంకమెసఁగె. 53

చం॥ నెలయనుపానవట్టమున నిల్చిననిశ్చలనీలలాంఛనో
జ్జ్వలశివలింగమున్ సమయశైవుఁడుగాంచి సుధాభిషేకమిం
పొలయఁగఁజేయ నిర్మలపయోరసముల్ తనుసోమసూత్రధా
రలస్రవించెనోయనఁ దొఱంగె హిమాంబుకణంబులత్తఱిన్. 54

తే॥ అంబుజారాతి విష్ణుపదంబునందుఁ, దన్మహాంగుష్టనఖము నఁదనరెనచట
జననమందిన సురనదిర్ఝరమనంగఁ, బండువెన్నెలదిశలెల్లఁ బ్రతిఘటించె. 55

సీ॥ అజునాజ్ఞ గడపరాదని కాని చక్రవాళాద్రిబాహ్యతమంబునణఁపలేద ?
తగదధోభువనపాతనవృత్తియని కాని బలిసద్మతిమిరంబుఁ బఱపలేదె ?
దేవమాతవిపక్షతెలియనేలని కాని గిరిగుహాధ్వాంతంబు గెలువలేదె ?
ద్విజవాసశోభనావిహ్వృతి కాదని కాని చెట్లచాయలయిరులఁ జెఱపలేద ?
యనఁ చుజను లెన్నఁ గర్పూరకనరుదార, కల్పతరుతార సునహీర కలితహార
కమనతారకళాధార కాంతిపూర, కౌముదీధార జగమెల్లఁ గప్పికొనియె 56

వ॥ మఱియునది విరాజద్ద్విజరాజతనూజకాఁపునఁ బావనమార్గంబున నుత్తమంబై పుష్పవతులై నలతకూనలు పెనగొనియుండు చాయలఁ బాయగిలనడచుచు వగవర్ణని గావునఁ దనుఁజూచి మధుపపరిభుక్తలగుపద్మినులు ముద్రితవదనలై తలలువంచుకొన సంచరించుచు మేనమామకూఁతురని తనుఁ బరిగ్రహింప నిరీక్షించు మనిత్తుధన్వి నన్వేషించుపాంకమున వికంపమానయై స్తనచక్రయు వికసితచకోరనయనయు విశదాంశుకాధృతయు విస్ఫుటకుసుమదామోదయునై నగంబులు నగంబులు నదీనదంబులు నలినాకరంబులు నానాదిగంతంబులు గలయ మెలఁగు నలయిక నలముకొన్న శ్రమాంబుకణంబులు చెందెనోయన హిమాంబులవంబులను గురియ గుఱియగువారలెదుర్కొని సంభ్రమంబునందొరయ దొరయనిచందాన నిరులు యథాయథలై పొలియఁ బొలయలుక దేఱి కామినీకాముకులు వెలయ వెలయడుగు విటులతో విటీతతి మాఱుమలయ మలయపవనోచ్ఛలితాచ్ఛాదనచ్ఛదనలై మదనకదనానంతరమున లతాంతశయ్య నొయ్యన నిద్రింప నించుబోణుల మొగంబులు తొంగి తొంగిచూచి గిలిగింతలు రేచి మేలుకొనఁ జేసె తదీయముదహాసకందళంబుల నందగింపుచు సంకేతనికేతన నూతనమకరకేతన శాస్త్రచింతన ప్రచింతనా పరులగువారలకు నఖండజ్యోతిర్మయిగాంధర్వవిద్యతోఁ జను దెంచు కమలాసనురాణి వాసంబు రాణనే శాంకపాషాణశ్రేణులఁ గరగించి జాలుకొనఁ జూచుచుఁ దనయెడ ననన్యాలోకనంబులఁ దమోగుణంబు వారించి సాహాప్యంబొనంగఁ బ్రసన్నయైన సత్వగుణాధిదేవతయన సకలప్రపంచంబును నిజకళాపరిచ్ఛన్నంబుగా సంఘటించి సరసకావ్యసారరుచిగ్రహణశక్తియు సారస్వతవిశదవర్ణనిర్ణీతప్రక్రియానురక్తియు సాధుశరధరభావవివేచనాసక్తియు సముచితప్రభాకరమార్గమాననీయయుక్తియు నభివ్యక్తంబుగాఁ జేయుచుఁ బూర్వపక్షసిద్ధాంతస్థాపనవిలసనంబు కలిమిని సమర్థించి నిర్నిద్రప్రభావాప్తిచే సుమనోవిలాసినియనమించి

ఘనసారపరిఖ్యాతినిగుడఁ గౌముదగంధక్రమనీహారశైత్యంబులతోఁ గమలజాండంబుఁ
గర్పూరకరండంబుఁగావించు నింపొందు నిస్తంద్రరాకాచంద్రచంద్రిక విజృంభించు
నవసరంబున నంబుజాలయనికుంజమధ్య మానియై యుండి పవమానతిరుమానలతావితానాంత
రజాలకంబుల నాజాబిల్లి వెలుంగుమూఁటి నిజాంగంబులఁదారి చురుకుచురుక్కున గారింప సై
రింపక చిగురుకటారివీరుని బారింబడి బడబడి నివిధిం దూఱుచు నెచ్చెలితో నిట్లనియె. 57

ఉ॥ "అన్ననమంచు రేయిఁ బగలా పగలా యొఁ బగాయె వెన్నెలల్
కన్నియ! యేమియుం దినవు గా యవు గా నవు గా దనీకు నీ
కన్నులయాన చందురుఁడు కాదుడు కావిడు కాలమెట్టిదో
వెన్నసుఁబంక్తువచ్చెఁగద పేపసపే యదవేగనింటికిన్,, 58

వ॥ అని విరహవేదనాదోధూయమానమాన పద్మ పురోభాగంబున.

మ॥ ఎలఁదేఁటిం గదిమించు మించుఁగనుదోయిం బాష్పముల్గూర్పఁ గూ
ర్పులతోంగిన్ విడనాడు నాడుశుకశారుల్ చేరిరానల్గు న
ల్గులు గాపూలని వేగు వేగుటకు దిక్కుల్ చూచు వేమాఱు మా
రు లకోరీలకుఁగాక కాఁక సతియారూఢిం బతిం దూఱుచున్ 59

వ॥ ఇత్తెఱంగునఁ గురంగేక్షణ లతాగృహంబు దొరంగి వెలుఁగందుచుఁ గురంగేం

కం॥ చూతమెటఁ జూతమనుచున్, శ్రీతరుణి తదీయవేదిఁ జేరి మనోభూ
శాతాశుగశాతాశుగ, జాతాశుగశర్ధ్ర తివ్యసనయై కనలన్ 61
కం॥ కాంత గతిమాని యిటు శశి, కాంతతలంబూని కడువగం బోగుల నిశా
కాంతమదనానిలాదులఁ గాంచి యుపాలంభనంబు గానని రలుకన్. 62
మ॥ "బుధులెన్నన్ భువనాధినాయకునకుం బుత్రుండవై హైమవ
ద్విధురాలోకము సంతసిల్లగ నుదారత్వంబుతో సత్కళా
నిధినామించి యనంతరాజ్యపదవిం దీండ్రిం చనీకేల యీ
శిథిలీభూతహృషీకపాంథమధనోత్సేకంబు రాకాశశీ!. 63

కం॥ ఇరులో ●కాసురవిరులో, యరులో నెఱిఁగురులు కన్ను లంగన చన్నుల్
సిరులు పురివీడవాడన్, బరితాపముగూడఁ జూడఁబాడియె? చంద్రా! 64

సీ॥ కలితపతంగమండలని పానత మేంతు వరయనీ రాక మిత్రోపకారి!
వన్నితా మోదభాస్వర వాసవాశానిరోధి నీమూపు దోషాధికారి!
పథికమనోభయాస్పదమహాబిలవిలక్ష్యంబు నీదగుబొల్పు చక్రవైరి!
జనితదుర్మార్గలక్షణనిస్ఫుటంబు నీవృత్తంబు సజ్జనశ్రీవిదారి!
యాహాహానీకృత్యమేమనవలవి లుబ్ధకుఁడవో? బాహ్యాత్ముఁడవో? రక్కసుఁడవో? కలివో?
కాక యుండినవొంతు వేశోక కుచుఁ? గనికరము లేకమీరి రాకావిహారి! 65

మ॥ గరిమక్ శుభ్రవిభూతి మేన నెద లింగంబొప్ప శైవస్థితిక్
గరమారాధ్యుఁడనంచు శీలముపా నంగక్ విప్రయోగివ్రజో
త్తర వైరస్యము కృష్ణపక్షవిముఖత్వం బంది యోచంద్ర! పెం
పరఁ బాపండుఁడ వైననిన్ను ద్విజరాజన్నక్ జనుల్ నవ్వరే?,, 66

కం॥ అని వైరవహితుదూఱుచు, నని వైరవళిం గడంగు నతనుశరము లో
య్యనవాతభూతచూత, గ్రునవకలిక లురుల శుకరథునినని రలుకక్. 67

కం॥ నమ్మని తే నెలుజడిగొన, నమ్ములనిటునింతురయ్య యజ్ఞాలయుపై?
నమ్మనుబట్టినపంతముఁ, జిమ్ముదమనుపలుకు నిజము చేసి మనోజా!. 68

కం॥ వలపులహారిదూఱఁగఁగన, వలపులసిరి నేచె దక్కటకట! కటికివై
చెలితనయుఁడవగునిన్నీ, చెలితనయుఁడవనుచు నమ్మఁజెల్లు నెమదనా! 69

చ॥ అరయ విషంబులోదివిరి యత్రశమాతక్ విషరాశిపట్టియై
మెఱసివిషంబునంబొదలు మీనమ్ము గాంక సరోరుహావళిక్
గరిమ ధ్వజంబుగా సఖునిఁగా శతకోటిగఁ బూన నంగజా!
సిరివలనొప్పనో ఘనరుచిక్ మనునో రహిమించునో తమిక్. 70

కం॥ అరదములయ్యునుమత్త, ద్విరదములగుకీరముల గవింతురె చెలిపై
దరదగతినీవు నీకుం, దరద మతిక్ వెఱతు నే ననంగ వనంగా! 71

కం॥ రేజాంగతనమునను వద, రేరాఁజిల్కలను సైతురే రాజముఖుల్?
రేరాపొడపునఁ గన్నీ, రేరా యనుమాత నేతు రేరా? మారా! 72

మ॥ అనుకూలించిననీయనంగతను దేహత్యాగముంజేయుమి
త్రుని బాటించి యరూపకంబయిన తేరుంబూని షండత్వమం
దినయమ్ముల్ గొని నీవుభీమహానోద్వృత్తిం దిరుగం జగ
జ్జనకుం డెట్లొనఁగూర్చెనీకుఁ దగునీసామగ్రి చేతోభవా! 73

చ॥ కుచములనీధ్వజాంకములు కొప్పుననీశరముల్ ధరించి ని
న్నచలజగొల్వఁగా నవినయస్థితి నేచి శుదంపదీశు నే
రుచివిభవంబుగోల్పడియుఁ గ్రూరతమాన వనంగ! నీకిదే
యుచితము దండసాధ్యుఁడ వయో! గుణసాధ్యుఁడవై ప్రియోక్తులన్,, 74

కం॥ అనిమారుమాఱు సమయం, బున గన్కొనవీమవాతపోతములఁగనుం
గొని శుకపికమధుకరముల, ముచుకొనియిట్లనిరి యుల్లములఁ దల్లడిలన్. 75

చ॥ "హరునిటలాగ్నిచే వెతల కాలయమైలయమైన మైత్రిమై
సిరిచెడి యున్నయస్మరుఁడు చిన్నెలవన్నెలతో లతోత్సవ
స్ఫురితవసంతుఁజేరఁ జెలి పూపొదలం బొదలం దలంకె నీ
చురుకుఁదనంబుమాని దయజూపవనాపవనావనావనిన్ 76

కం॥ శుకమా! ముఖరుచిజితకిం, శుకమా! సుకుమార దేహశోభితదూర్వాం
శుకమా! రకమేలరతీ, శుకుమాయిచ్చినహయమ పసూయగనకుమా. 77

చ॥ కొలకొలమంచుఁగోపురపుఁ గోవెల క్రేవలనీవలావలన్
గలకలరేఁచఁజూచి పయికావలిగాఁజలిగాలివ్రాలి తో
య్యాలినలయించెఁజిల్కలగయాళివిగాకవనాళినీవునన్
వలవలమన్ వశాపళినవాళిదువాళిగ మేళవింతురే. 78

ఉ॥ లేమ భవన్మృదూక్తినడలీబడలీనడలీకుతూహలం
బామనితీపులోనిపికమా శుకమా మొకమాటలేకయ
య్యో! మృదువాణి నేచచలమో ఫలమో బలమో గణింపరే
కామునియానమీకు నెనగా ననఁగా వినఁ గానమెచ్చటన్. 79

చున్నవారు - మొన్న గొట్టిపాటిలో రథకారులులేక రథమెట్లునడిచినదో వినలేదేమి? కావున యుష్మదీయుల కీయహంభావముగూడఁ బ్రయోజనకారిగానుండలేదు - మంగలి యవసరములేకుండఁ దమకుఁదాము క్షౌరముచేసికొనుటయుఁ చాకలితోనవసరములేకుండఁ దమవస్త్రములు తామిస్త్రీచేసికొనుటయుఁ జర్మకారుని యవసరములేకుండఁ దమకుఁదామే పాదరక్షలమర్చుకొనుటయు నేర్చిన నవనాగరికులు మీతోనవసరములేకుండఁ దమపనులుతాము నెరవేర్చుకొనలేరని యెన్నఁటికిని దలంపకుఁడు.

ఇంకను బల్లెలలోని పుష్పిణీవసనక్షాళనమును బస్తీలలోని పురీషోత్సర్జన శిలాసంశోధనమును మాత్రము మఱియొకరు నేర్చియుండలేదు - కావున రజకునితోడను బాకీవానితోడను జనులకధికావశ్యకముండకతీరదు - లోకులకు మావలని ప్రయోజనమించుకేని లేదో? ప్రపంచమున విద్యావ్యాపన మెవరినుండియో యయినది మొదలొకటివిచారించుదము అపౌరుషేయములగు వేదములుదప్ప తర్క-వ్యాకరణమీమాంసాదిసర్వశాస్త్రనిర్మాతలును బ్రాహ్మణులు స్మృతీతిహాసపురాణకర్తలు బ్రాహ్మణులు కావ్యనాటకములుచెప్పి సర్వదేశములయందును సంస్కృతభాష వ్యాపింపఁజేసినవారు బ్రాహ్మణులు - దేశభాషలలోని బహుప్రబంధముల రచించినవారు బ్రాహ్మణులు-ప్రభువుల్రమోల మంత్రిత్వపదవినధిష్ఠించి భూపరిపాలనచేసినవారు బ్రాహ్మణులు - "నాన్ బ్రామిన్" అని తీసివేయఁబడెడి ప్రకృతకాలమునఁగూడ నాంగ్లేయులతర్వాతఁ బెద్దయుద్యోగములలోనుండిన పలుమంది బ్రాహ్మణులు ఇట్టిబ్రాహ్మణులవలననే ప్రజలకేమియు నుపయోగములేదని వక్కాణించుట గర్హ్యము ఇంతయేల? మీకందఱకీ యింతవిద్యగఱపిన వారెవరు? ఇప్పటికిం జెప్పుచున్న వారెవరు? నరసరావుపేట తాలూకా కంవరగొట్టిపాటి మీవారికిఁ బ్రకృతము షోడశకర్మలు చెప్పుచున్న వారెవరు? యల్లమంద గ్రామనివాసులు వల్లూరు లక్ష్మీనారాయణగారూ? వారిప్పుడు విశ్వబ్రాహ్మణులలోఁజేరినను బ్రాహ్మణులే - ఐతే తిన్నయిల్లుగ్రుద్దలించెడి మీకేలవిద్యఁజెప్పుచుండెనంటే వారికిబ్రాహ్మణులకుఁజెప్ప నధికారములేదు - అట్లుండిన స్వధర్మప్రకాశినీ పత్రికాధిపతులగు శ్రీ కోటీశ్వరశాస్త్రిగారి యాజ్ఞానుసారము వారివేదపాఠనిలయంలో నుపాధ్యాయత్వమున కేలయియ్యకొనరు? ఎవరేవాఁగుఁబడితేమాకేమి కాని శాలకులకు బ్రాహ్మణులవలని ప్రయోజనము మీకింకను దెలియకున్న స్వధర్మప్రకాశికలోని యీక్రిందివ్యాసముం జదివికొనుఁడు.

# బ్రాహ్మణు లేమి యపకారము చేసిరి?

---

ప్రకృతమున మనమే ప్రదేశమునకు వెళ్లివిచారించినను "మనభరతఖండ మిట్టిహీనస్థితిఁ జెందుటకుఁ గారణభూతులు బ్రాహ్మణులు" అనునొక సిద్ధాంతమును మనము తఱుచుగా వినుచున్నాము. ఈనిర్ణయ నిర్ణేత లందఱు నవనాగరికు లయియున్నారు గాని వీరందఱు బ్రాహ్మణులేయని వచించుటకు మాత్రము విచారముగానున్నది. బ్రాహ్మణులిట్టి వారగుదురా కారాయను సంగతి వీరలకు దుర్బోధముగాదుగాని యాబోధ తెలుసుకొనవలయునను తలంపు లేనియెడలఁ గలుగదు. వీరల కట్టి జిజ్ఞాస సప్నమందైనను లేదు. బ్రాహ్మణులమగు మనకు వేదంబులును, తదనుయాయిస్మృత్యాదికమును నెటులఁ బ్రమాణమో యటుల వీరికి పాశ్చాత్యులవచనములు ప్రధాన ప్రమాణములు. ఈమహానుభావులు వారివచనము లనుసరించియేమిగుల సంశయాస్పదంబు లగు విషయంబుల నైతము నిర్ణయింతురు, దఱుచుగాఁ దద్వచనంబులకు విరుద్ధంబులగు విషయంబు లన్నియు నప్రమాణము లనియే వీరి యభిప్రాయము. వారి యనుగ్రహాతిశయము వలననే తమ కిట్టి జ్ఞాననేత్రము నైతము గలిగెననియు వచింతురు. ఆపశ్చిమదేశీయుల వేషభాషలును, సౌష్ఠవమును, విహారాహారములును, ఆచారమును మున్నగు వానినిఁగని మోహాతిశయముచేత సంకుచిత దృష్టులయి భరతఖండసంభవుల యాచారవిహారాదుల నిర్విశంకముగ నిందించుటయేగాక తదాచారానుసారులఁజూచి "యోహో వీరు బ్రాహ్మణులా" యని నిందాగర్భితముగాఁ బలికెదరు. ఈ భరతఖండమున బ్రాహ్మణాది వర్ణచతుష్టయమును, అనేకజాతులును గలవు. తత్తజ్జాతులు నియతముగ నొవర్ప్ఛ వృత్తులు నైతమనేకములు. ఇందు బ్రాహ్మణుఁడు శూద్రస్త్రీని వివాహము చేసికొనఁడు శూద్రుఁడు బ్రాహ్మణస్త్రీని వివాహముచేసి కొనఁడు. ధర్మమార్గాభిలాషియగు నెవ్వఁడేని విధవోద్వాహము చేసికొనఁడు. ఈ చెప్పిన నియమంబులు బ్రాహ్మణులు మిక్కిలి పాటింతురు. ఇట్టి బ్రాహ్మణులనే యుక్తాయుక్తవిచారము విడనాడి ఈ మహానుభావులు నిందింతురు. మృతులగు పిత్రాదుల నుద్దేశించిచేయు శ్రాద్ధములయందు బ్రాహ్మణుల నిమంత్రించుట వీరలకుఁ దలనొప్పిగా నుండును. తిండిపోతులయి యనాయాసముగ భక్ష్యభోజ్యంబుల మ్రింగఁదలఁచి యిఁకనొక పన్నాగము పన్నినారనియు మిగుల

నీరసముగా మాట్లాడెదరు. కృతఘ్నులగు మఱికొందఱు "బ్రాహ్మణులు మమ్ముల నజ్ఞానగర్తమునఁ బడవైచిరి" అని పలుకుచు శక్తికొలఁది బ్రాహ్మణులకు క్లేశ మొనర్చుటయే దమకుఁ గర్తవ్యమని తలఁచియటులఁ జరించుచున్నారు. బ్రాహ్మణులవంటి యనుపయోగ మగుజాతి మఱియొకటిలేదని కొందఱును, "బ్రాహ్మణులు స్వగౌరవమాత్రమునందే గౌరవముగల వారలయి యితరజాతీయుల వంచించిరి" అనిమఱికొందఱును, ఇటుల నానావిధములుగ విచారశూన్యులై దుర్భాషలు మాట్లాడెదరు, ఈభరతఖండమున జనించి విద్యాధికులనఁ బ్రసిద్ధివహించిన మహానుభావులే యిట్టివచనంబులు బ్రాహ్మణులఁ గూర్చి మాట్లాడుచుండ నిఁక విదేశసంభవులును, విధర్మీయులును నగు నితరజాతీయులు నింద్యముగా మాట్లాడుచున్నారనుట కాశ్చర్యమేమి? ఈభరతవర్షము యొక్క ప్రకృతహీనస్థితికిఁ బ్రధాన కారణము బ్రాహ్మణులు" అను సిద్ధాంతము కొంచె మించుమించుగ నిప్పటివిద్యావంతులయందును, వారివచనముల ననుసరించు విద్యావిహీనులయందును, దవానలతుల్యముగ నంతటఁ బ్రసరించుచుండుటచేత దీని యథార్థము విచారింపఁ దలఁచి మొట్టమొదట ప్రాచీన బ్రాహ్మణుల విషయమయి విచారింతుము. పిదపఁ బ్రకృతకాలపు బ్రాహ్మణులఁ గూర్చి విచారించెదము. బ్రాహ్మణులచేతనే యిట్టిహీనస్థితి మనదేశ మనుభవించుచున్నదని సిద్ధాంతము చేయువారలు కేవలము ఇప్పటిబ్రాహ్మణులను గూర్చియేకాదు. ప్రాచీనులును నిందలకు కారకులనియే వచించుచున్నారు. అందుచేతనే ప్రాచీనులగుఱించియు, నాధునికుల గుఱించియు వ్రాయఁ దలఁచినారము. సామాన్యముగాఁ బైనిర్ణయనిర్ణేతలు పలువురు నవనాగరికులుగా మాకుఁ దెలియుటచేత నిటులు వ్రాసితిమిగాని కొందఱితరులును నుండవచ్చును. మేమువ్రాయు నదియు నట్టినిందఁజేయువారలకు యథార్థము దెలుపఁదలఁచి వ్రాయుచున్నారము గాని వారిని నిందఁజేయుటకుఁగాదు. మేమిందు నవనాగరికులని వ్రాసిన పదము గుణదోషములు విచారించక నిష్కారణముగ బ్రాహ్మణుల నిందించువారలకే యన్వయించును గాని ఇతరుల కన్వయించదు. ఇది మాయభిప్రాయము గావున మేము స్పష్టముగ నిందుఁదెలిపినారము. ఇక ప్రకృతవిషయము విచారించెదము.

ప్రాచీనకాలమునఁ బ్రథమవర్ణులగు బ్రాహ్మణులు శాంతులును, శమ దమాదిగుణసంయుతులును, జితేంద్రియులునై సత్యస్వభావులును, క్షమావంతులును నైయుండిరి.

తమ పిత్రాదులచేత బాల్యమున నైదవయేట నక్షరాభ్యాస మొనర్పఁబడిన వారలయి కొలఁది కాలములోననే భాషాపాండిత్యము గ్రహించి గర్భాష్టమ సంవత్సరమున నుపనయన సంస్కృతులై యదిమొదలు గురుగృహంబున నివసించి బ్రహ్మచర్యాద్యాశ్రమనియమంబుల యథాశాస్త్రంబుగ నొనర్చుచు శక్త్యనుసార మొకటి రెండు మూఁడు నాలుగు వేదంబుల శిక్షాద్యంగసంయుతంబులుగ నధ్యయనముచేసి పిదప శాస్త్రంబులన్నియుఁ బఠించుచుండిరి. విద్యాభ్యాసముచేసి పిదప సమావర్తులై సత్కులప్రసూత యగు కన్యను పరిగ్రహించి గృహస్థాశ్రమ నియమంబులఁ జరించుచు వైశ్వదేవాది కృత్యంబుల యథాకాలంబున సలుపుచుండిరి. వివాహంబు యథేచ్ఛంబుగఁ గామసుఖంబుల ననుభవించుటకుఁ గాదనియు, కేవలము పుత్రోత్పాదనార్థ మాత్రమేయనియు వారుతలంచిరి. అనుదినము గృహాగతులగు నభ్యాగతాది బృందములకన్నపానీయము లిచ్చుచు, నటులనే వస్త్రాదికములిచ్చి శిష్యబృందములకు వేదశాస్త్రంబులు బోధింపుచు యోగ్యులకుఁ దగిన దానము లిచ్చుచుండిరి. ఇటులనే యంధులకు, కుంటివాండ్రకు, వికలాంగులకునన్నపానీయంబు లిచ్చిపోషించుచుండిరి. తత్తద్వర్ణాశ్రమోచిత కృత్యంబులు దామాచరించుటయేగాక ఇతరులకు సైతము బోధించుచు నిహలోకంబునఁ గీర్తియు పరలోకంబునకు సుకృతంబును సంపాదించుచుండిరి. ఇహలోకంబున మాత్రము సుఖాభాసము గలిగించుచు పరలోకవిఘాతుకంబులగు విషయంబులఁ బరిత్యజించుచుండిరి. న్యాయసభలయందు న్యాయాన్యాయముల విచారించువిషయమున రాజులకు సహాయ మొనర్చుచుండిరి. ఆపత్కాలములయందు మాత్రము తనకంటె తక్కువ యగు వర్ణస్థుల వృత్తుల నవలంబించి జీవయాత్రను గడపుచుఁ పిదప స్వవృత్తులనే యవలంబించుచుండిరి. ఇతరుల బాధించుట నరకమని భావించుటయేగాక పరులనుండి వచ్చు సన్మానము గ్రహించుట సైతము విషతుల్యముగా గణించుచుండిరి. ఇటుల గృహస్థాశ్రమము గడపి కాఁడవులకుంజని యచటఁ బర్ణశాలల నేర్పరచికొని యందు నివసించుచు నీవారాన్నముచే జీవయాత్రగడపుచుండిరి. యోగవిద్యా ప్రభావమువలన నభీష్టవస్తువుల సంపాదింప సమర్థులై వేనవేలు విద్యార్థుల కన్నపానీయాదికము లిచ్చి వేదశాస్త్రంబులఁ జెప్పుచుండిరి. తదనుసారములగు నూతనప్రబంధముల నిర్మించుచుండిరి. నూతనశిల్పంబులఁ గనిపెట్టుచుండిరి. వేదవేదార్థంబులు చక్కగా విచారించుచు బహు

విధంబులగు నీతిప్రబంధముల నొనర్చుచుండిరి. వేయేల, ఇహలోక సుఖమును పరలోకమున కవిరోధంబుగ నుండునటుల నొనర్చిన వారలయి ఈ భూలోకమును స్వర్గతుల్యంబుగ నొనర్చిరి. యోగబలంబుచేత భూత భవిష్య ద్వర్తమానకాలవిషయంబుల నెఱింగి తదనుసారము జాగరూకులై చరించుచుండిరి. తుదకు తురీయాశ్రమము స్వీకరించి నిరతిశయానంద ధామమును, స్వానుభవమాత్రసంవేద్యమును నగు పరబ్రహ్మమును స్మరించుచు నాపరబ్రహ్మమునందే లీనులగుచుండిరి. గ్రంథవిస్తరమగు ననితలంచి యిందులకు ప్రమాణభూతంబులగు వచనములుదాహరించక యిటుల వ్రాసితిమిగాని అవశ్యమనితోచిన చోటియొకప్పుడు ప్రమాణభూతములగు వచనము లుదహరింతుము. ఓ చదువరులారా ! ఇటులఁ జరించుచుండిన ప్రాచీనపు బ్రాహ్మణులేమి యుపకారమొనర్చిరో తమరేయూహింపుడు. వీరు స్వజాతీయుల నెటుల వృద్ధిలోనికిఁ దెచ్చిరో యటులనే క్షత్రియాదీతర జాతీయులనైతము వృద్ధిలోనికిఁ దెచ్చిరి. వీరికృపచేతనే క్షత్రియులు స్వస్వవర్ణోచితక్రియలయందు సమర్థులైరి. వీరియనుగ్రహము వలననే వైశ్యులు శూద్రులు తమతమపనులయందు నేర్పరులైరి. ఏవిధముగాఁ జూచినను నప్పటి కాలపు బ్రాహ్మణుల ప్రవర్తనము మిగుల గౌరవ్యముగానుండెను. వారి ప్రవర్తనమును జూచి బ్రాహ్మణులకు గల భూదేవయను పదము వారియందు సామాన్యముగనే ప్రవర్తించుచుండెనుగాని విశేషోక్తిగ నెంచబడదయ్యెను. సామాన్యముగాభూదేవాది పదములు వారి ప్రవర్తనానుగుణముగనే వారియందు వాడబడెనని చెప్పినను యుక్తంబుగ నుండ వచ్చునుగాని అతిశయోక్తి గాజాలదు.

వీరు స్వజాతి వృద్ధిని గురించి బ్రాహ్మవిద్యావిషయిక గ్రంథంబులొనర్చి వానిని స్వజాతీయుల కెటుల బోధించిరోయదే విధంబుగ క్షత్రియాదులకు వలయు గ్రంథంబులొనర్చి యవి వారలకు బోధించిరనుటకు వారిచేనొనర్పఁబడిన దండనీత్యాది గ్రంథంబులే ప్రబల నిదర్శనములు. ఆగ్రంథములఁ దిలకించిన నీతితంత్రపారంగతులని తమరందఱిచేత నంగీకరింపఁబడు ఇప్పటిరాజుల నీతి ప్రాచీనులనీతియందు షోడశాంశమైన నుండునో ఉండదోయను విషయ మెఱుంగఁ గలము. ఇట్టినీతినిఁ బ్రతిపాదించు గ్రంథంబు లొనర్చినవ్యాసుఁడేమి, నారదుఁడేమి, శుక్రుఁడేమి, కామందకుఁడేమి, ఘటకర్పరుఁడేమి, చాణక్యుఁడేమి, వీరందఱు బ్రాహ్మణులేగదా. యుద్ధసన్నాహసమయమున వ్యూహాది

నిర్మాణ విషయమునుగూర్చియు, * నాళికాస్త్రవిధియును, అందులకువలయు నగ్ని చూర్ణాదికమును నుపదేశించిన శుక్రుఁడు మున్నగువారలు బ్రాహ్మణులేగదా. ఇదేప్రకారము వైశ్యవృత్తులగు కృషివాణిజ్యపశు సంరక్షణాదిక విషయములఁ దెలుపుగ్రంథము లొనర్చినవారును బ్రాహ్మణులేసుమీ. బృహద్రథునకు పశులక్షణము లెఱుంగఁ జెప్పిన పరాశరుఁడు బ్రాహ్మణుఁడేగదా, అశ్వలక్షణశాస్త్ర మొనర్చిన శాలిహోత్రుఁడెవ్వఁడు ? గజాయుర్వేద మొనర్చిన పాలకాప్యముని బ్రాహ్మణకులోత్పన్నుఁడేగదా. కృష్యుపయుక్తమగు భూమియొక్క పరీక్షయు భూగర్భవిజ్ఞానమును ప్రతిపాదించు ప్రబంధము లొనర్చిన సాంహితికు లెవరు ? బ్రాహ్మణులేగదా వృక్షాయుర్వేద మొనర్చిరి. ఒకచోట మొలచిన వృక్షముల మఱొకచోటికి నాటుటయు, భూమియొక్క రోగములును, తన్నాశమునకు వలయు నుపచారములును, కుసుమములు ఫలములు బాగుగనిచ్చు నుపాయములును, అకాలములయందు పుష్పఫలాదులఁ గలుగఁజేయు విధానములును, వృక్షముల పాతుటకు ప్రతి వృక్షములు మధ్యభాగమున నుండవలసిన భూపరిమాణము, కొమ్మలు నాటుటచేతనే వృద్ధిఁజెందు వృక్షముల విషయమును, బీజారోపణమున వృద్ధిఁజెందు వృక్షముల విషయమును, ఉద్యానవనముల గూర్చి తెలియపరచు గ్రంథములును చేసినవారలు బ్రాహ్మణులాయెవరు ? ఇటులనే శూద్రుల కుపయోగించు ప్రబంధము లొనర్చిన విషయంబులఁ గూర్చి

---

* నాళికాస్త్రమన సాధారణముగా మనమిప్పుడు వాడు తుపాకి యగును. ఈ విషయమైన ప్రాచీనులకుఁ దెలియు సంగతిని గూర్చి క్రమక్రమముగ ప్రాచీన, శాస్త్రములనుండి ప్రమాణవచనములు ఉదాహరింపుచు ముందు వ్రాయుదుము.

వారును బ్రాహ్మణులనుట జగద్విదితము. నర్తనోపజీవుల నిమిత్తమే నాట్యశాస్త్రము
విప్రులొనర్చిరిగాని స్వజాతీయులఁ గూర్చికాదు గదా. వస్త్రములు నేసి జీవించువా
రల నిమిత్తమయి వసనసీవనశాస్త్రమును, శిల్పిజనుల నిమిత్తము రథనిర్మాణాదుల
ప్రతిపాదించు శాస్త్రమును, గృహనిర్మాణాది కంబులఁ దెలుపు వాస్తుశాస్త్రమును
చిత్రలేఖన ప్రతిపాదక శాస్త్రమును నొనర్చిన వారలును బ్రాహ్మణవంశసంభవులుగదా.
వేయివిధంబులుగఁ జెప్పఁ బ్రయోజనంబేమిగాని యీభరతఖండమున బ్రాహ్మణులెఱుం
గనిదియు, బ్రాహ్మణులచే నొనర్పఁ బడనిదియు, నగు శాస్త్రమే లేదనియు నిస్సందే
హముగాఁ జెప్పవచ్చును. ఈశాస్త్రములన్నియు స్వోపయోగార్థమయి బ్రాహ్మణు
లొనర్చలేదనుటయు నిస్సందేహము. బ్రాహ్మణులు కేవలము వేదంబులకును ధర్మశాస్త్రం
బులకును మాత్రమే యధికారులయి యుండిరి ఆపద లేనిసమయమున క్షత్రియాదీతరజా
తీయులవృత్తుల నవలంబించియుండ నేలేదు. అస్త్రశస్త్రాదిసకల సాధనంబుల మిగుల
నేర్పరులయ్యు నొక ఋషియేని రాజ్యాశచేత శస్త్రముచేతఁ బట్టి రాజుతోడయుద్ధంబు
చేయలేదు. లేక పశుపాల నాదికము చేయ మొదలుపెట్టి వైశ్యులవృత్తికి భంగము కలి
గించియుండలేదు. శిల్పాది వృత్తులయందు మనస్సు జొనిపి శూద్ర జాతీయుల జీవన
మునకు లోపము గలిగించి యుండలేదు. బ్రాహ్మణుఁడన సమస్తవర్ణస్థులకు మిత్రభూ
తుఁడు, అతనికిజగ మంతయుమిత్రులే. స్వార్థలాభము కోరకయే జగమంతయు మిత్ర
తుల్యముగ భావించు నీబ్రాహ్మణులకు శత్రుఁ డెవ్వఁడు? ఈ విధమున స్వశరీరపతన
పర్యంతము కేవలము మనుష్యులకేగాక జంతువులకు నైతము హిత మొనరించు బ్రాహ్మణ
జాతివారినుండి యేమాత్రమయిన లాభముగాని యుపకారముగాని యభిలషించెనా
మఱికొందఱు "బ్రాహ్మణులు సకలశాస్త్రములు స్వోపయోగార్థము మొట్టమొదట
నొనర్చుకొనిరి. పిదప నవియే యెల్లరకు లాభము కలుగ చేసినవి" యనియనఁదలఁతురు.
అదియు పామరుఁ డనఁదగిన మాటయే ఏలనన, సౌధాదినిర్మాణమున కుపయోగించు
వాస్తుశాస్త్ర మొనర్చిన మునీశ్వరుఁడు పర్ణశాలలయందుండియే జీవయాత్రను గడపుకొని
యెను. మయిపూతలు మొదలగు వాని విధానంబులు దెలుపు శాస్త్రములఁ జేసిన
ఋషీశ్వరుఁడు భస్మాలంకృత శరీరుఁడేకదా. భూషణాదుల నొవర్చురీతిం దెలుపు
శాస్త్రములఁ జేసిన ఋషీశ్వరుఁడు భస్మాలంకృతశరీరుఁడేగదా. భూషణాదుల నొన
ర్చు రీతిందెలుపు శాస్త్రగ్రంథకర్త యలంకారములు రుద్రాక్షమాలలు. వస్త్రనిర్మాణ

విధులఁ దెలిపిన ఋషీశ్వరుఁడు నారచీరలు గట్టికొనియెను. కృషిశాస్త్రవిధులఁ దెలుపు ప్రబంధము లొనర్చిన మహానుభావులరణ్యంబులనివసించి నెవరిధాన్యమో దుంపలో అకులో దినుచుండిరి. ఈ విషయంబు లెఱింగిన బ్రాహ్మణులు స్వోపయోగార్థముచరించి నదియులేక పరోపకారార్థముచేసినదియు, బుద్ధిమంతులకు విశదము వీరలు స్వోపయో గార్థము, దర్భాసనములు, జింకచర్మములు, నారచీరలు. సమిధలు, కమలపుట్టికలు, దర్భలు, గోమయము, మొదలగునవి ? మాత్రమే కైకొనుచుండిరి. ఇటుల వీనిని మాత్రమే గ్రహించుట యసమర్థతచేతఁగాదు గదా, అసమర్థులయిన నూతనంబులగు నటువంటిశాస్త్రంబు లెటుల గనుగొనియెదరు ? యోగమహిమవలన నింద్రాదిపదవుల నైన నూతనంబులుగ నిర్మింప సమర్థులగు వారల కీసామాన్యసుఖముల ననుభవించుటకు వలయు వానిని సంపాదించుకొనుట కష్టమా ? అన్ని విధముల సమర్థులయి యుండియు నిటుల పరులక్షేమాదుల మాత్రమే పరమార్థములని భావించిన యట్టిబ్రాహ్మణుల దూషించు వీరలకు నోరెటులవచ్చెనో దెలియదు. ప్రతిజ్ఞచేసి నందవంశమంతయు నిర్మూలము చేసినటువంటియును సకలనీతి శాస్త్రపారంగతుఁడునునగు చాణక్యుని గృహమునందును గోమయమురాతిముక్కలు మొదలగునవియేయుండెనుఁగాని లేశమైన నుసంపదలేదు. ఈ విషయము ప్రాచీనుల గ్రంథములఁ దిలకించిన విశదమగును. ఈవిధమున వీరువారనక సర్వకాలములయందు నందఱి క్షేమమును గూర్చియే ప్రయత్నించు బ్రాహ్మణులయందే లేనిపోనియపవాదములు వీరుగల్పించుచున్నారు. ఇట్టియపవాదములు బ్రాహ్మణులేమి యపకార మొనర్చిరని వేయుచున్నారో మాకు తెలియుటలేదు.

ఇతరులనుండిలాభమెటులే బ్రాహ్మణులు కోరలేదో యటులనే పరులనుండి గొప్ప సనా నమేమియుకోరలేద. ధర్మశాస్త్రములయందు “ శ్లో॥ సన్మానాద్బ్రాహ్మణో నిత్యముద్విజేత విషా దివ ” యని చెప్పఁబడియున్నది. అనఁగా బ్రాహ్మణుఁ డెల్లప్పుడు పరులుచేయు మన్ననలవలన విషమునుండివలె భయపడవలయును. పరులు చేయు మన్ననను గూర్చి తాను సమర్థుఁడయినను నది యంగీకరించగూడదు అనిభావము.

మఱికొందఱు “ బ్రాహ్మణులు స్వగౌరవము సంరక్షించుకొనదలఁచి క్షత్రియాది వర్ణస్థుల నజ్ఞానాంధకారమునఁ బడద్రోసిరి ” అని పలుకుచున్నారుగాని యామాట మిగుల నిస్సారమయినది. వీరిమాట నిజమనుటకు నెచ్చటనేని యొకటియేని ప్రమాణ

మ॥ రా॥ రా॥ దివాకర్ల తిరుపతిశాస్త్రిగారికి.

అయ్యా, 25-8-11 తేదిగల యుత్తరము చేరినది.

1. దానింబట్టిమాడఁగా మీకు జంకుకన్న వడియు, వడికన్న జంకు విశేషించియున్నటుల తెలుపుచున్నదిగాని, మాయుత్తరమున మీవారి నుండి తప్పించుకొనదలఁచినవాక్యము లేవికనుగొంటిరో తెలియదు.

2. మీరెండవ పేరాయందలి సంగతులందరికి హితమైనవే.

3. ఆశుకవిత్వావధానములయందని మేము వ్రాయుచుండ దానిం బరికింపక నాశుకవిత్వశతావధానములేయని త్వరపడితిరిగదా?

4. ఒకప్పుడెత్తికొని మఱియొకప్పుడు దించుట మామతముకాదు.

5. పరాభవమునకు బందెముగా మీమీసమిదివరకే నిర్ణయింపబడియుండినది.

6. శతావధానాశుకవిత్వముల పేరులెత్తి ముందుగా గాలుద్రవ్వినవారే తమశక్తి ముందుజూపవలయునని మీరొప్పికొంటిరిగనుక యీ కలహమునకు గారణభూతులై యాశుకవిత్వశతావధానములకు గాలుద్రవ్విన మీరేముందుగా జేయవలయును. పిదప మేమవి యతిశయింపవలయును. 22-8-11 తేదీన మేము వ్రాసినపద్యము మరియొకమారుచూడుడు.

7. మీసపుపద్యములో నుదహరించిన విషయమునకు దగరు తగరని మీరును దగుదుము తగుదుమని మేమును వ్రాయుట కాగితములచేటుగాక యెప్పటికిఁ దేలదని వదలితిమి.

8. 20-8-11 తేదీన మేము ప్రచురించిన పత్రికయందుగల సీసపద్యమందలి యేర్పాటులేకాక తదితరములు పనికిరావు.

9. మీతొమ్మిదవ పేరా విషయము మనయుభయులచే నేర్పాటుచేయఁదగినదికాదు. ఆభారము సభ్యులదియైయున్నది.

10. మాస్నేహము మీరే ముందుగా గోరినవారగుటచే మీస్నేహము మేమును నిల్పఁ బ్రయత్నింతుము.

**11.** రేపటియాదివారమునకే సభ కావలయునను తత్తరము మీకుగాని మాకుగాని యుండగూడదనుట వ్యవధిగోరుటను సూచించుచున్నది. మరల సమ్మతమేయని పాముచావకుండ బడితె విరుగకుండ వ్రాయుట యుక్తముకాదు.

**12.** ఇదివరకే యేర్పరుపబడిన వివాదాంశములయందు మా మీ బలాబలంబుల గనుపరుచుటకు నిర్ణయింపబడిన సభ యింటిలోని పెండ్లివలె జరుగబడునుగాక గుడిలోని పెండ్లివలె నెప్పటికి జరుగనేరదు.

**13.** ఈకలహమునకు కారణము గుంటూరిసభయందు మీవలననే కలిగినదికావున నట్టి గుంటూరు సభయందే యిదితీరవలయును.

**14.** నెపములుపన్ని వ్యవధిగోరుచు నెట్లేని సభలుజరుగకుండ జంపునడుపునది మీరేకాని మేముకాద. ఎవరివలనగలిగిన నష్టమునకు వారే పాత్రులగుదురుగాని మీమెట్లగుదుము?

**15.** తెలుగునేని మీకువదలితిమని యనుకొనకుడనుట కేవలమనవసరము, సభలోనోడినప్పుడుగాక తెలుగు మాకువదలుడని మిమ్మెవరు కోరిరి.

**16.** మీరు **11** వ పేరాలో మహావిషయమనియు **16** వ పేరాలో నల్పవిషయమనియు వ్రాయుట విచిత్రముగానున్నది. అనవసరముగ వ్రాతవ్రాసి కాలముగడుపక మేమిదివరకువ్రాసిన విషయములకు సమ్మతించినచో తెలుపుడు, సభలో నోడించుటయందన్యాయమేమున్నది.

**27-8-11.**

ఇట్లు,
కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మ,
శతావధాని.

---

గుంటూరు
**27 - 8 - 11**

వ ॥ రా॥ రా॥ కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మగారికి.

అయ్యా,

(1) ఒరూరు « అని **25** వ తేదీని మేమువ్రాసిన యుత్తరమునకు **27** వ తేది **11** గంటలకు మీరిచ్చిన జవాబు అందినది.

(2) ఉత్తరప్రత్యుత్తరములు పెంచఁగూడదలంచుటయేకాని, మా వ్రాసిన యంశముల కొక్కదానికైనను సదుత్తరము మీరీయఁదలఁచుకొన్నట్లులేదు, కావున మీయుత్తరములోని యితరసంగతులకు జవాబియ్యలేదు.

(ఈ క్రిందివిషయముల కుత్తరమీఁదలంచితిరే నిండు, లేదా! యూరకుండుఁడు.)

౧. సభ ముందు మీరే చేయవలెను, ముందుత్తరము వ్రాసి యవధానాశుకవిత్వములకై కాలుద్రవ్వినవారు మీరుకాని మేముకాము.

౨. మీసప్రఁబద్యవిషయమైనచో మేమే ముందు సభఁజేయఁదగినదికాని, మీయుత్తరములోని 7 వ పేరా ప్రకారము మీసప్రఁబద్యము వదలుకొన్నట్లు పూర్తిగా స్ఫుటమగుటచే నాభారము మామీఁద లేదు, ఆవిషయమేయని యిప్పుడేని వ్రాలనంటిరా! మేమే మాపి మిమ్ముఁ బిదపఁ జేయుచుందుము, దానిపందెము దానియందేకలదు.

3. క్రొత్తవిషయమగుటచేఁ గ్రొత్తవారే క్రొత్తపందెమేర్పఱుపవలయును.

౪. మావిషయమై మీరును మీవిషయమై మేమును నవస్థానపుటేర్పాటులు చేసికోవలసినదేకాని యయ్యవి సభ్యులేర్పఱుపఁదగినవికావు, ఉభయులచే నేర్పఱచికొనఁబడిన సభ్యులు న్యాయాన్యాయములును రసారసములును తారతమ్యములును విచారింపఁదగినవారు మాత్రమే.

౫. ఈవిషయముల కంగీకరించుచు, మీరుసభ సమకూర్పుఁడు, లేదా మేము సమకూర్చెదము, మీకిష్టులగు నల్గురు సభ్యులను (జడ్జీలను) మీరేర్పఱచుకొనుఁడు, మేమును నట్లేయేర్పఱచికొందుము, సభాధిపతి వారిచే నేర్పఱచికొనబడును, ఇంక నుత్తరప్రత్యుత్తరములు పెంచక యంగీకారానంగీకారములు తెల్పుఁడు, తెలుపరేని మీరీయుద్యమము మానికొన్నట్లే ప్రజలు దలంతురు గాత.

౬. సభ నేయించుటగాని సభకు వచ్చుటగాని స్థిరీకరించినచో (స భాముఖమందు మీయవధానాశుకవనములకు లక్షణము చెప్పి పండితుల నొప్పింపవలెను.

౭. "ఈకలహమునకుఁగారణము గుంటూరుసభయందు మీవలననే కల్గినది" అని 13 వపేరాలో వ్రాయించినారు, ఆకారణము మీముఖముగావినినఁగాని మేము నిర్ణయించుకొనము చల్లకువచ్చి ముంత దాఁచుట యెందులకో మాకరయరాకున్నది.

౮. జవాబనివ్రాసినను వెనుకటివలెనే ఆలస్యముచేయక రేపు సూర్యోదయమునకు తప్పక జవాబు పంపవలెను.

ఇట్లు,

దివాకర్ల తిరుపతిశాస్త్రి.

---

ఉదయం 8 గంటలకు 28-8-11

గుంటూరు.

అయ్యా!

ఈదినమున సభ తప్పక జరుగునను మీప్రకటనను బురస్కరించుకొని యనేకులనేక గ్రామములనుండి వచ్చి నిరీక్షించుచున్నారు వారిని వృథాశుల నొనరించుట యుచితము కాదు కావున నవధాన సభావిషయ మేమయినదియుఁ బ్రకటించి వారిసందియము తీర్పుఁడు. మా యుత్తరమునకు బ్రత్యుత్తరము రాకుండఁగనే మేము ప్రకటించుట యుక్తము కాదు గదా?

ఇట్లు,

దివాకర్ల తిరుపతిశాస్త్రి.



29-8-11.
గుంటూరు,

అయ్యా,

మొన్న వ్రాసిన యుత్తరమునకును నిన్నటి యుత్తరమునకును మీరి ప్పటికిని జవాబువ్రాయలేదు. తగినప్రత్యుత్తరమివ్వెదరా! లేకా? మీతూష్ణీంభావము మనకార్యములకేకాక పెక్కుమందికార్యములకుఁ గూడ భంగముఁదెచ్చుచున్నది. దీనికేని జవాబు నేఁటిమధ్యాహ్నము 2 గంటలలోపుగా రాదేని 27వ తేదిగల మాయుత్తరములోని 5 వ పేరా లోని చివరసంగతి నిజమనియెతలంచి మేము కాకినాడకు వెళ్లుచున్నా ము మీయావజ్జీవము మీరు పూన్చిన పూనికమాత్రము వదలువారము కాము.

ఇట్లు,
దివాకర్ల తిరుపతిశాస్త్రి.

మ॥ రా॥ రా॥ దివాకర్ల తిరుపతిశాస్త్రి గారికి.
29-8-11. గంటలు 11.

అయ్యా,

1. క్రియతేలని జవాబులతో గాలహరణ మొనరించుచున్నది మీరే కాని మేముగాదు మీ మీసపుబద్యవిషయము మేము వదలలేదు.

2. సభయందు దాశుకవిత్వావధానాదుల ముందు సలుపవలసినది మీరేకాని మేముగాదు అందునకు గారణమిదివరకే తెల్పినారము. మీ మీసపువిషయమే కావున మీ మీసమునకన్న వేరే పందెమునవ సరము.

3. మేమిదివరకు దెల్పిన నాల్గింటియందును సభ్యులు న్యాయమని తోచిన పద్ధతుల నవలంబించి మనయందలి తారతమ్యముల నిర్ణయింప దగియున్నదికాని మీరును మేము నేర్పాటులుచేసికొనుట మాకంగీకా రముకాదు.

4. మనము చేరి నలుగురుజడ్జీల నేర్పరుచుకొనుట కష్టసాధ్యముగాన చేరియొకరిని గాని చేరి యిద్దరిని గాని సభ్యులలోనుండి యెంచికొనుటయు వారిచే సభాపతి యెన్నబడుటయు దగునని మాయభిప్రాయము. తక్కినయంశము మీకును మాకును సమమేకదా.

5. ఈవిషయమై సభ గూర్చుటకును, అట్టిసభ దగుపద్ధతులతో నడపుటకును వలయు నేర్పాటులను పెద్దమనుష్యులు కొందరాలోచించుచున్న సంగతి మీకును దెలసినదేకదా.

6. 7 పేరాలో మీరరయు గారణము మాకిప్పటికిని గానరాకున్నందునకుమాత్రము విచారముగానున్నది.

7. శీఘ్రకాలములోనే సభయందు మన తారతమ్యములు తేలుచున్నవి కావున మీరిదివరకు వ్రాసినట్టియు ముందు వ్రాయబూనినట్టియు త్తరములకిదియే జవాబుగా నెంచగోరుచున్నాము.

ఇట్లు,
కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మ,
శతావధాని.

మ॥ రా॥ రా॥ కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మగారికి.

(1) మీరు సభకొఱకు నిర్ణయించిన **27-28,** తేదీలు తప్పించి మా నిబంధనలకంగీకారానంగీకారముల నేనిఁ దెల్పక చల్లఁగా సభ దాటించి గతజలసేతుబంధనమన్నట్లు **29**వ తేదీని **12** గంటలకు జవాబు పంపుటయు ఆజవాబేని స్వవచోవ్యాఘాతములతో నిండియుండుటయుఁ జూడఁగా మా **27**వ తేదీ యుత్తరములోని "తెలుపరేని మీరీ యుద్యమము మానికొన్నట్లే ప్రజలు దలంతురుగాక" అను వచనము స్పష్టమేయైనది. అయినను నీపిష్టపేషణ మవధరింపుఁడు.

మీ వ్రాఁతవలన నేదోరీతిని మసిపూసి నేరడుకాయ చేయుత్రోవకన్పట్టుచున్నది. మామీఁదఁగాలుద్రవ్వువాఁడు ముందుకవియైయుండుటయేకాక విద్వత్కవియై యుండుటట్లుండ పైగా నుభయభాషాసాహిత్యజ్ఞానముఁగలిగి వ్యాకరణాదిప్రజ్ఞలుండి యాశురచనయందు నేర్పుగల్గి నిరాఘాటమైన యవధానశక్తి కలవాఁడుగా నుండవలెను. ఇందులో మీ రాంధ్రమున నాశుకవనమును నవధానశక్తియుఁ గలవారమని చెప్పుచుఁ గాలుద్రవ్వితిరి. ఆంధ్రమనఁగా నేకల్లిబొల్లిపదములనో యెట్లో వ్యవహరించునదికాదు. నన్నయాదుల సమ్మతులట్టివి

కావు. అయినను నందులకే యొప్పికొని మీమనోరథము నెఱవేర్పఁబ్రయత్నించిన "చెట్టు ముందా విత్తుముందా సూత్రముందా కారుముందా" యను వాదమునకు దిగుచున్నారు. కావున మనయవధాన సభల మాటట్లులుంచి మీమాటలలోని వివాదాంశముల నుభయసమ్మతులగు నల్వురైదుగురు ప్రాజ్ఞులచే విమర్శింపఁ జేసికొని వారి శాసనము ననుసరించి యిందుఁబ్రవర్తించుట యుక్తము. ఇందులకు మీయభిప్రాయమేమి ? జాగుసేయక జాబువ్రాయవలెను.

గుంటూరు,
29-8-11
సాయంత్రము 7 గంటలు,

ఇట్లు,
దివాకర్ల తిరుపతిశాస్త్రి.

పరా - ఇందు వ్రాసినవిషయము చిరకాల మాలోచింపఁ దగినదికాదు గాన రేపు సూర్యోదయము 8 గంటలకేని మాకుఁ జేరునట్లు ప్రత్యుత్తరము వ్రాయుదురుగాక.

మ॥ రా॥ రా॥ దివాకర్ల తిరుపతిశాస్త్రిగారికి.

(1) మీయుత్తరమురాత్రి 9 గంటల కందినది, ఇంతవరకుమీమాకు జరిగిన యుత్తరప్రత్యుత్తరముల జదువువారలకెవ్వరివి వృథాప్రాగల్భ్యములనియు నెవ్వరివలన సభకంతరాయము గలిగినదియు దెలియకపోదు.

(2) ఓహో, ఆ సభయటుండనిచ్చి మీమాటలలోని వివాదాంశములను నిర్ణయించుటకు ప్రాజ్ఞులతీర్మానమొకటి కావలయునుగా ! మేల్ మేలు.

(3) ఇంతటనైన మీస్వకపోలకల్పితములు మానుకొని పలువురాలోచింపనున్న సభయందు మీప్రజ్ఞావిశేషమును జూపింపుడు, లేకున్న మీరోడినట్లేయని వేరుగాజెప్పవలెనా.

కావుననింతటితో నుత్తర ప్రత్యుత్తరములు ముగింపగోరుచున్నాము.

30-8-11

ఇట్లు,
కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మ-శతావధాని.
ఉదయము--8--గంటలు

శ్రీమత్పరదేవతాయైనమః

నిష్పక్షపాతహృదయులును యథార్థపరిజ్ఞాతలును నగు నో గుంటూరుపురవాస్తవ్యులగు నార్యసోదరులారా! కొప్పరపువారు ప్రతిజ్ఞాపూర్వకముగా 27 వ తేదీ ఆదివారమునాఁడు సభకు రావలయునని ముందుగామాపైఁ గాలుద్రవ్వి పత్రిక వ్రాసి, యందులోని యసందర్భములను దెల్పుచు మేముత్తరమీయఁగా, దానికిఁ దగుసమాధానము వ్రాయక యేవో కొన్ని యుక్తులతోఁ గొన్ని యుత్తరములు వ్రాయుచు సభ ఆదివారము తప్పించి సోమవారమునకు మార్చిరి. తుదకాదివారమునాఁడు రాత్రి యనేకగ్రామములనుండి విచ్చేసిన మహాజనుల విఫలమనోరథులఁ జేయుట యుచితముకాదని మేమాదివారమునాఁడు వ్రాసిన యుత్తరములోఁ గొన్ని పండితసమ్మతములైన నిబంధనము లుదాహరించి "యీప్రకారము మీరు సభకూర్పుఁడు లేదా మేముగూర్చెదము అంగీకారానంగీకారములు రేపుదయమునకుఁ దెల్పుఁడు లేదా మీరీయుద్యమము మానుకొన్నట్లే ప్రజలుదలంతురుగాక" అని స్పష్టీకరించినను దానికి జవాబువ్రాయక, సభానిర్ణయదినమునందుఁగూడ నుదయము 8 గం॥కు మరల రిజైండరు పంపినను దానికిని నేమియుఁబలుకక చల్లఁగా నాదినమెల్ల దాఁటించి ఆమరునాఁడు 29 వ తేదీని మాకవసరము లేకున్నను మేము మరలమీయుద్యమము మానుకొన్నట్లేయనితలఁచి మేముకాకినాడ వెళ్లుచున్నామని వ్రాసినయుత్తరమునకును దగినసమాధానమేమియు వ్రాయకుండుటచే వారు సభను మానుకొన్నట్లు ముమ్మాటికిని స్పష్టపడినది

పిదప సభమాటట్టులుంచి మీ మా యుత్తరప్రత్యుత్తరములలోని సారాసారములును న్యాయాన్యాయములును ప్రాజ్ఞులమూలముగాఁ దీర్చికొనిపిమ్మట విద్యావాదమునఁ బ్రవర్తింతమనియు ఇందులకు రేపుదయము 8 గం॥కు లోఁగా జవాబిండని 29 వ తేదీ రాత్రి 7 గంటలకు మావ్రాసిన యుత్తరమునకు నేఁడు 10 గంటలకు ననవసరపు యుక్తుల

తో దానికిఁగూడ నంగీకారమును దెల్పక "యుత్తరప్రత్యుత్తరములు ముగించుకొన్నాము" అని వ్రాసిన యుత్తరమునుగూడఁజూచి వారికి జబాబువ్రాయుట యింతతో ముగించుకొని ఆ యీ యంశములు లోకులకు శ్రుతపఱుపఁదలఁచి ఈనాఁటి సాయంకాలము 6 గంటలకు శ్రీ ఘట్టుకంపెనీ నాటకశాలలో నుపన్యసించుచున్నారము గానఁ దామెల్ల విచ్చేయఁ బ్రార్థితులు.

గుంటూరు,
30-8-11.

ఇట్లు,
తిరుపతివేంకటేశ్వరులు, శతావధానులు

---:o:---

పైనుదాహరించిన యాహ్వానపత్రిక ననుసరించి శ్రీ ఘట్టుకంపెనీహాలులోనికి ననేకులు పౌరులును నితరులునునగు మహాజనులు నియమితకాలమునకుముస్నే వచ్చియుండిరి. పచఁపడికాలేజియుపాధ్యాయులగు బ్ర॥ శ్రీ॥ మల్లాది వెంకటసోమయాజులవారి కోరిక ననుసరించి శ్రీమాన్ వంగిపురం కృష్ణమాచార్యులు బి. ఏ. ఎల్. టి. (వీరును కాలేజీ యుపాధ్యాయులే) గారగ్రాసనాధిపత్యమును వహించిరి. వీరు సంస్కృతాంధ్రములలో గ్రంధముల రచియించిన పండితకవిసత్తములు. పిదప నాయాయీ యుత్తరములు తిరుపతివేంకటేశ్వరులు వినిపింపఁదొడంగిరి. మొదట వెంకటశాస్త్రిగారు శ్రీ కొప్పరపువారి మొదటి యుత్తరమునుమాత్రము వినిపించి ఆనాఁడే 12 గంటలు మొదలు మూడు గంటలవఱకును గోర్టులో గంపాలులనుగూర్చిన వ్యాజ్యములోసాక్ష్యమిచ్చియుండుటవలని యాయాసముచేఁగాఁబోలును పఁచఁపడియుత్తరములను దిరుపతిశాస్త్రిగారిని వినిపింపుమనిరి. తిరుపతి శాస్త్రిగారు వినిపించుచుండఁగాఁ గొందఱు పెద్దమనుష్యులువచ్చి యంతతో ప్రకృతసభముగించుటకై వెంకటశాస్త్రిగారిని గోరిరిగాని తగినంత హేతువును జూపి కోరనందున వెంకటశాస్త్రిగారందుల కంగీకరింపరైరి పిదప గంభీరముగాఁ దిరుపతిశాస్త్రులగారాయా యీయుత్తరప్రత్యు

త్తరముల నుపన్యసించుచుండఁగా వెంకటశాస్త్రులగారు దానినాప నుంకించువారితో సహేతుకముగా మెల్లఁగా నుపన్యసించుచుం డిరి. పదఁపడి సభనాపుఁడని కోరినవారు తామేదో మధ్యచెప్పు టకు నవకాశమిండనికోరిరి. అందులకును దుట్టతుదనుగాని వీలులేదని యు నప్పుడేని యగ్రాసనాధిపతుల నడుగఁదగియుండుననియును వెం॥ రా॥ గారు బదులు చెప్పిరి. పదఁపడి యుత్తరములనెల్లఁ దిరుపతిశా స్త్రిగారు వినిపించినపిదప నెవరుసమర్థులో, యెవరుకారో, యెవరియు త్తరములు దురుసుగానున్నవో యెవరివట్టివికావో, యెవరు కోరినవుర తులు పండితసమ్మతములో యెవరివికావో, యెవరి వెనుకతీఁతవలనసభ కాలేదో, లోనగు నంశములు సభ్యులకేకాక సభనాపవచ్చిన యుత్తమ పురుషుల హృదయములకుఁగూడ స్పష్టపడినవి. ఆ యీయంశములనే శ్రీ అగ్రాసనాధిపతిగారు తుట్టతుద నుపన్యసించుచు మీసములపద్య మునొక్క యర్థమునుగూర్చి తాముగూడ నిదివఱకుఁ బొరపాటుగా నే యన్వయించుకొంటిమనియు నిప్పుడది స్పష్టముగాఁ దెలిసినదనియు నుభయభాషలు రానివారు దానిజోలికిఁ బోఁగూడదనియు సంస్కృ తము రాని తెలుఁగుగణనీయముకాదనియు నుపన్యసించుచుండఁగా సభ నాఁగుపూనికతో విచ్చేసినవారు ప్రకృతమావిషయము నాగవలసినదని కోరిరి. దానిమీఁద నగ్రాసనాధిపతిగారు వీరికోరిక ననుసరించి యీ పద్యార్థమునిప్పుడు విస్తరింపక వదలితిమని చెప్పి యీవిషయముమాని తమకీయుభయకవులయందును భగవంతుఁడున్యాయముగాఁ దోఁపించిన యభిప్రాయమును వెల్లడించిరి. అదివిని సభ్యులెల్ల నానందించిరి. పిదప శ్రీ వెంకటశాస్త్రులవారు కవితయననేమో, కవియన నెవరో, ఆశుకవితయననేమో, కవికివలసిన సామగ్రియేమో తేటతెల్లముగాను పన్యసించిరి. పదఁపడి సభనాఁగు పూనికతో విచ్చేసియున్నవారిలోను కరగు మ॥ రా॥ రా॥ గోవిందరాజుల శ్రీ వాసరావుపం లు బి. యే. బి. యల్. గారు సర్వసమ్మతముగ తమ మనోరథము వెల్లడించిరి. వారిపూనికను వెంకటశాస్త్రిగారు తమ సమ్మతినిదెల్పి, పదఁపడి

యంతకొక యరగంటకును న్నైరెలుదిగి సభాభవనమునకు వచ్చియున్న ట్టియు తిరుపతి వేంకటేశ్వరుల శిష్యుఁడైనట్టియు చిరివాడ గ్రామకాపురస్థులు శ్రీ వేలూరి శివరామశాస్త్రిలవారి క్రిందిపద్యములఁజదివిరి.

ఆ॥ వె॥ రాజాశ్రీ భుజంగరావు చల్పతిరావు
గూర్చి యిటులు వ్రాసె గుంటురుపురి
జరుగుచున్న వైరచర్యయందునఁదిరప
తికవి, వెంకటకవి, తెరువుతప్పె॥1॥

చం॥ అనవినియంత నామడేలు నామడేలుంబడిపోయినట్లు వ
చ్చిన నదిమిథ్యయంచుఁదెలిసెన్ గవితాసభలేకపోయెఁగా
కనువుగ ధారణాబలమునందున నాశుకవిత్వమందునన్
దనివిగఁ గొప్పపుంగవుల దారులు తీరులు చూచితీరనే॥2॥

తే॥ గీ॥ కాశినాథబుధేంద్రుఁడు ఘనుఁడు శ్రీని
వాససూరియు సెందఱోవలఁతులైన
కవులు పీఁకనిమీసము కఱచిపట్టి
పీఁకనున్నారె కొప్పంపుఁ బిదపకవులు॥3॥

తే॥ గీ॥ కలదు నేత్రావధానంపు గరిమయొకఁడు
కలదు గర్భావధానంపు గరిమయొకఁడు
కలదు హస్తావధానంపు గరిమయొకఁడు
వీని తెలియఁగని సూరులెందేని గలరె॥4॥

ఉ॥ అందము మీఱఁగాఁ గవులుహాయిగ వీనులవిందుఁజేయసం
క్రందనతుల్యులౌ విభులు రచ్చలమెచ్చఁగ సత్కవిత్వమా
నందముగల్గునట్టులనొనర్పుదుఁ వేలొకఁ, డందునిందునం
దందు శతావధానమును నష్టవధాన విధానమొక్కఁగం
టం ద్విశతిద్రుతపద్యకరణంబును నియ్యవివేలు వేలు చే
యందరమేయటంచు బుధులందఱు వల్కుదురట్లుగాక మా
టిందృఢమొప్ప నొక్కఁడవడిందగిలించి శతావధానము

ధ్యందమిమీఱఁగా నతులితాష్టవధానము దానిమధ్యమం
దుం దొరలించి త్రైశతముతోడనఁ జెప్పి శతావధానపూ
ర్తిం దగురీతిఁ జేసి పయిఁ దేకువ మీఱఁగ రెంటియందుబు
ద్ధిం దిలకించి ధారణవిధిం జదువంగలవాఁడ నబ్బురం
బందఁగ దీని జేయుమనియందురొ మాటిని వేఱువేఱఁ జే
యందగునందురో మనుమహోత్తముఁడు తాఁ జరికొండధర్మఁడున్
సుందరసత్కవిత్వపరిశోభితుఁడై తగు రాఘవుండు శో
భందనరారు రంగఁడును పండితుఁడై తగు వెంకటార్యుఁడ
స్పందితబుద్ధిసాగరులు భవ్యులు దిర్పతి వేంకటేశులీ
చందపుధారణాబలపుసంపదచే నవధానమెత్తెడం
డెందము పల్లవింపఁగఁ గడిందిగఁ జేసియు మాకు నింతభి
క్షం దయసేయ దానిఁ గొని కాదె వధానము నాచరించుటా
దిందరియించుటల్ సభలఁ దేఱుట లిచ్చటికేగుదేరుటల్
నందితసత్కవిత్వ పరిణాహకృతుల్ సుకృతుల్ సభాసదుల్॥

అనంతరము తిరుపతిశాస్త్రిలవారు తమరు కాకినాడ వెళ్లుటనుగూర్చి
న యావశ్యకతను దెల్పి యందులకై పౌరులయాజ్ఞను కోరి అట్లు కోర
చోఁ గలిగెడి యపవాదులను గొన్నిటినంతకుమున్నె వృథా గాఁ గల్గినవా
నిని జెప్పి యొప్పించి పండితసమ్మతమగు సభకుఁ దమ యావజ్జీవమును బ
మావధిగాఁ గడవు నొసఁగితిమనియు వారెప్పుడందుల కంగీకరింతురో
అప్పుడే వెంటనే తెలుపవలసియుండుననియును నుడివి విరమించిరి. పి
ప వెంకటశాస్త్రిగారు తాము మరికొన్ని దినము లీపురమున నేయుండెద
మనియు నున్నను బ్రకృతవిషయమున నీఁకఁ దమకు సంబంధముండఁబో
దనియు నుపన్యసించుచుఁ గొన్ని చమత్కృతి ప్రధానములగు వాక్య
ములచే సభకానందమును గల్గించిరి. అంతటితో సభ జయజయ ధ్వా
లతో ముగిసెను. మఱునాఁ డీక్రిందిపద్యములను వేలూరి శివరామ
స్త్రిలవారు కొప్పరపువారి కంపిరి.

శ్రీమత్పరదేవతాయైనమః *

మ॥ రా॥ రా॥ శ్రీ. కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మగారికి.

చ॥ తిరుపతి వేంకటేశులకుఁ దెంపరివై సరివైఖరిం గవీ
శ్వరుఁడగువాఁడు నోటనుడువన్ గడుసిగ్గిలు నాశుధారకున్
బురికొలుపందలంచితె "నమోనమః" యంచు వచింపకేటియ
ల్లరియిది సింగమేన్గుపలలంబు భుజింపక పూరిమేయునే॥

మ॥ అనిమిత్తంబుగఁ గాలుద్రవ్విన త్వదీయాహంత నాపుందలం
పున నీనీరసనిర్గుణాశుకవనంబున్ జెప్పి నిన్గెల్వ నెం
చిన యస్మద్గురువర్యులన్ సుకవితాశ్రీధుర్యులన్ మానిపిం
చి నినుం గెల్వఁగ వచ్చినాఁడిదె సభం జేయింతువో వత్తువో॥

ఉ॥ గంటలు గట్టికొంటివట "గంటకు వందలు వేలు పద్యముల్
గెంటుదునంచు" నేఁడు పరికించెద గెంటుటయెట్టిదో నినుం
గెంటెద నేవధానమున గెల్చెద నీరసధారయందు నీ
ఘంటికలూడఁగొట్టెదను కాచుకొనం గమకింపుమిత్తటిన్॥

సీ॥ గురుపాదసేవఁ జేకూరిన వ్యాకృతిపాండిత్యగరిమయెట్టుండనిచ్చి
ఉభయభాషాకావ్యవిభవాభిరామమౌ పాండిత్యగరిమయెట్టుండనిచ్చి
రసవత్ప్రబంధనిర్మాణధీచాతురీపాండిత్యగరిమయెట్టుండనిచ్చి
సురుచిరలక్షణభరితాశుకవిత్వపాండిత్యగరిమయెట్టుండనిచ్చి॥

గీ॥ ఆశుపత్తనంబటంచుఁ గొండాడఁదగిన
తావకాశుకవిత్వంపుఁ జేవఁ గూడ
తావకశతావధానవిధంబుఁ గూడ
జూడఁదలఁచితి వేంకటసుబ్బరాయ!

చ॥ తిరుపతి వేంకటేశ్వరసుధీవరశిష్యుఁడ నాదుపేరు వే
లూరి శివరామశాస్త్రియని లోకము వాకొను నాఢ్యమైన వ్యా
కరణము జీవనమ్ము నధికారము కావ్యపురాణనాటకా
కరములఁ జేయఁజాలుదు నఖండమ్మునాఁగ శతావధానమున్॥

గుంటూరు
31-8-11

ఇట్లు వినీతవశంవదుఁడు,
వేలూరి శివరామశాస్త్రి,
శతావధాని.

పిమ్మట త్రిపురనేని రామస్వామిగారీక్రిందిపద్యములఁ
కొప్పరపువారికిఁ బంపిరి.

శ్రీగురుభ్యోనమః.

మహారాజశ్రీ కొప్పరపు సుబ్బరాయశర్మగారికి.

సీ॥ అఖిలదేశంబున నవధాన మొనరించు,
టోకాద! యిదియుగుంటూరుసీమ
పల్నాటిసీమలోఁ బద్యంబులను జెప్పు,
టోకాద!యిదియుగుంటూరుసీమ
ఆయూర నాయూర నాశుకవిత సెప్పు,
టోకాద! యిదియు గుంటూరుసీమ
గుడివాడసీమలోఁ గొన్నియూళ్లను జెప్పు,
టోకాద!యిదియు గుంటూరుసీమ
గీ॥ ఎట్లుదక్కించుకొందురో యిపుడుమీరు,
నిండుకొల్వునమీకున్న దండిబిరుదు
లూరకేపోదు పూజ్యులఁ గాఁబిలువ,
నాశుకవిసింహ పండితహంసలార.

ఉ॥ బట్టులరీతిఁబద్యములఁ బల్కుటెకాని శతావధానమె
ప్పట్టుల నేదిచేసితిరి, పండితులెల్లరు మెచ్చినారలో
గుట్టుగఁబోవకీగతిని, గొంటెతనంబును జేయజూతురే
పెట్టలు క్రొవ్విపుంజుపయి, బీరముఁజూపినలాగుదోఁపదో.
గీ॥ జగతివైదికులాట మీసాలఁదీసి,
కొన్ననెవ్వరునవ్వరు; నిన్నునవ్వ
కుందురేకన్నవారు నియోగివయ్యు,
మీసములఁ గాచుకోలేక మిడుకుచుండ.

క॥ గంటలఁగట్టెదరే! ము,
క్కంటికితురగములకు హాలికవితానంబీ
గంటలుమఱియేకార్యము,
పొంటె వచింపుఁడు కొప్రపుంగవులారా.

సీ॥ శతఘంటకవనంబుసల్పుదు మన్నమీ,
శక్తియడంపనేఁజాలనొకొ
అష్టావధానంబు నాచరింతుమనమీ,

శక్తి యడంప నేఁజాలనొక్కొ
ఆశుకవిత్వంబు నాచరింతుమనమీ,
శక్తి యడంప నేఁజాలనొక్కొ
సద్గ్రంథరచనంబు జరపుదుమన్న మీ
శక్తి యడంప నేఁజాలనొక్కొ
ఇంగిలీషునవత్తుర్గో యెఱిఁగియడపఁ,
గరము నేఁజాల నెక్కొ మాగురువులేల
రండు వేగ మీ బిరుదులు తెండు పెట్టి,
పాండునిండుసభను గొప్పపుఁగవులార
గీ॥ ఓడినారని తలపోయువాఁడ మీరు
నాకుఁ బ్రత్యుత్తరంబును నీకవితాన
ముద్రవహియింతు రేని నీముచ్చ టెఱిఁగి
ముందుపనిఁ జూడుఁడీ కొప్రపుఁగవులార.

క. శివరామశాస్త్రి గారికి। జవాబునొసఁగకయెవ్వధగజంపునడపెనన్
వ్యవసాయముకలదుసుఁడీ। వ్యవధింగయికొనకయిండుప్రత్యుత్తరమున్.

అంగలూరు,
3-9-1913.

ఇట్లు, బుధజనవిధేయుఁడు.
త్రిపురనేని రామస్వామి.

పిదపఁ గాకరపర్తి యగ్రహారమునుండి సామవేదుల సూర్యనారాయణావధాని గారి క్రిందియుత్తరము కొప్పరపువారికంపిరి

శ్రీరాములు.

శ్రీమత్పరదేవతాయైనమః

బ్రహ్మశ్రీ
సామవేదుల సూర్యనారాయణావధాని నేత్రావధాని అండష్టావధాని
వద్దనుంచి

మహారాజశ్రీ
కొప్పరపు వెంకటసుబ్బరాయ
శర్మ కేవలాంధ్రశతావధాని
గారికి.

## విద్యాచర్చాపత్రిక

అయ్యా,

తమకున్ను బ్రహ్మశ్రీ తిరుపతి వెంకటేశ్వర మహాకవులకును ఒకమాసంబునుండి జరుగుచున్న కవితాకలహంబును పత్రికాముఖంబున

వింటిని. అందువీరు మేమే ఆంధ్రకవీశ్వరులము. మేమే నేత్రావధానులము. మేమే యష్టావధానులము. మేమే శతావధానులము. మేమే యాశుకవితా ధురంధరులము. వేయేల మేమే ఘంటాపంచశతపద్య రచనా చతురులము. అని వీరు వ్రాసికొని యహంభావము వహించి యానందించితిరిగదా! తమంతట తామే యిట్టివ్రాతలు వ్రాసికొని యానందించుట హాస్యాస్పదమని తామెరింగిన సంగతియె. అది యటుండనిండు; సర్వసాధారణమైన యాశుకవితకేమి; తమకు నేత్రావధానంబున నెన్ని బిరుదులున్నవో; యష్టావధానంబున నేయంకితంబులున్నవో; వేదంబున నేగండ పెండేరంబులున్నవో; సంగీత శాస్త్రంబున నేఘంటలున్నవో, వానినివీరు కంటె నతిశయించి కాకరపర్తి విద్వత్సభలో ది 20 సెప్టెంబరు 1911 సం॥రం తేదీని తత్తదంశంబుల నెరవేర్చి యూడబెరుకుచున్నాను. గనుక నీనోటీసు అందిన వెంట నేమీప్రజ్ఞా విశేషంబును గనుపరుప నారోజునకు కాకరపర్రు మీరు రాకోరెదను. లేనిచో "మీతో విద్యాచర్చలకు రాజాలను" అని నాకొక జాబైనను వ్రాయకోరెదను. ఇట్లు జరుపరేని మీవ్రాతలసత్యంబుగా వెల్లడించెదరు. మీయహంభావత్వమును జూడ నేనహంభావప్రకటనాసహ్యుండనైనను మీయెడల నేనహంభావము వహించితిని. ఇందుకు పెద్దలనుగ్రహింతురుగాత.

ది 14—9—1911.
మకాం కాకరపర్రుఅగ్రహారం
తణుకు తాలూకా, కృష్ణాజిల్లా.

చిత్తగించవలయును.
ఇట్లు,
సామవేదుల సూర్యనారాయణావధాని,
నేత్రావధాని అష్టావధాని



## ప్రధానపోషకులు

## శ్రీశ్రీజగద్గురు విరూపాక్షస్వాములవారు.

ఈసంవత్సరము చందాయిచ్చిన—

పోషకులు.

1 తాడేపల్లిలక్ష్మీనరసింహరావుగారు, మక్తాదార్, చోళ్లేరు.
2 రంగావఝ్ఝల హనుమయ్యగారు, జిల్లాకోర్టువకీలు, గుంటూరు.
3 ప్రత్తిపాటి బ్రాహ్మణులు, వైశ్యులు.
4 పులిపాకపూర్ణయ్య పంతులుగారు, వకీల్, నర్సరావుపేట.

ఇవ్వవలసినవారు —

5 తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల.

ఈ నెలసొమ్ము చెల్లించిన చందాదార్లు

1 ఎసమంద్ర వెంకటసుబ్బయ్యగారు—కొప్పరపుంబాలెము.
2 అబ్బరాజుసూరయ్యగారు-తాలూకాక్లర్కు—సత్తెనపల్లి.
4 కొతాపుండరీకాక్షుండుగారు-ప్లీడరుగుమాస్తా-గుంటూరు.
3 పన్నాలబుచ్చిరామయ్యగారు-మల్లేశ్వరస్వామ్యాలయధర్మకర్త ,,
5 వేమూరు వెంకటసుబ్బయ్యగారు-హేడ్కలెక్టరాఫీసుక్లార్కు. ,,
6 తుమ్మెటిపాపయ్యగారు-తుమురుగోడు.
7 పిరాట్లఅప్పయ్యగారు-కోనాయపాలెం.
8 దేవులపల్లినరసింహశాస్త్రిగారు-మండపేట.
9 గోగులలక్ష్మీనారాయణగారు-కరణము-గోగులపాడు.
10 రామరాజుసీతారామయ్యగారు-కరణము-వ్యాపకంపల్లె.
11 పుచ్చాసీతారామశర్మగారు-పెదకొండూరు.
12 వల్లూరునరసింహారావుగారు-సూక్కుల్ మాష్టరు-చినమక్కెన.
13 దంతెంరాజునారాయణరావుగారు-పిడుగురాళ్ళ
14 కానుమానుకోటయ్యకుమారుండు వెంకటసుబ్బయ్య. ముప్పాళ

# ప్రకటన.

కమనాలులమీఁదిదావాలో నాతోఁగూడ బ్ర॥ 1 మల్లాదిరామకృష్ణసోమయాజులవారు 2 శిష్టాసీతారామశాస్త్రులవారు 3 చెళ్ళపిళ్ళవెంకటశాస్త్రులవారు, ఈమువ్వురుపండితులను 1బ్రాహ్మణుని 1వైశ్యుని, 1కమ్మను, 1తెలఁగాను, 1గొల్లను, 1చాకలిని, 1మంగలిని, 1యానాదివానిని విచారించి మరల నవంబరు 5 తేదీకి సరియగుకార్తికపూర్ణిమను వాయిదావిధించిరి. పైవాయిదాకు వచ్చినసాక్షులకేమి చూడవచ్చినమఱికొందఱికేమి గుంటూరిలోనికొందఱుబ్రాహ్మణులును వైశ్యులును నన్నసత్రముంబెట్టి నాకుమహోపకారమొనరించినందుకుఁ గృతజ్ఞుఁడనగుచు వచ్చువాయిదాకును మరల నదియ ప్రకారముసాహాయ్యమొనరించినాభారమొకకొంతతగ్గింపఁబ్రార్థితులు

పల్నాటివీరచారిత్రము — ఇది ద్విపదకావ్యము. గ్రంథకర్త శ్రీనాథుఁడేయగుట గ్రంథనాణ్యము చెప్పనవసరముండదు కాని దీనిని నీచకులజులు సుద్దులుగాఁజెప్పికొనుచుండుటచే నుత్తమవర్ణులును విద్వాంసులును గొంతకాలమునుంచి సన్మానించుచుండుటలేదు. కురుపాండవయుద్ధవిశిష్టమగు భారతకథవలెనీగ్రంథము కడువినసొంపై యుండుటచేతను స్వదేశచరిత్రయగుటవలనను గ్రాంథికవికృతమగుటను మిక్కుటముగా లేకపోవుటను పురాణభాషనేర్చి శతావధానియై యాంధ్రవ్యాకరణమును ఛందోలక్షణమును జక్కఁగనభ్యసించి కుశాగ్రబుద్ధియగుట 1-2వత్సరములలో నేగీర్వాణమున నాటకాంతసాహితిగలిగి భాష్యములసహితమున్వయింపఁజాలిన మాయూరికిసార్థక్రోశదూరమందలిగుత్తికొండగ్రామనివాసిఅక్కిరాజు ఉమాకాంతమీగ్రంథముం బ్రకటించి కథానాయకులయొక్కయు గ్రంథకర్తయొక్కయు యశముతోపాటు తనయశముగూడ జగద్వ్యాప్తముంబొనర్చె-మా పత్రికయందుఁబ్రకటింపఁబడువీరభాగవతము నిదియు నొక్కటే కథ వలయువారు బెజవాడ హిందూహైస్కూలుకు వ్రాయవలెను.

---